## నా కలం

ఇది నా ద్వితీయ కుసుమం. అనాదినుండి సంఘంలో వస్తున్న కుళ్లను బహిరంగపర్చి, పవిత్ర ప్రేమకు స్థానం వుందని సంఘం, మతం, కులం, గోత్రాలతో పని లేదనీ, ప్రచారం చేయటమే నా ముఖ్యోద్దేశం. అదే యీ నాటకం ద్వారా బహిరంగ పర్చాను. ఇది వకరినిగూర్చి వ్యక్తిగతంగా వ్రాసిందికాదు. గత 10, 12 సంవత్సరాలనుంచి నాటక రంగస్థలంమీద నాకు గల అనుభవమే న న్నీ నాటకం వ్రాయమని ప్రోత్సహించింది. నాటికలు, నాటకాలు వ్రాయటం యిదే ప్రథమం గనుక అనేక లోపా లుండవచ్చును. అవి దయవుంచి తెల్పితే ముందు ముద్రణలో సరిదిద్దుకోగలను. కళాభిమానంకల సోదర సోదరీమణులు యీ నా చిన్ని పుస్తకమును సహృదయంతో స్వీకరించి నన్ను ఆశీర్వదించవలసిందిగా కోరుచున్నాను. యీ నాటకం వ్రాయుటలో నాకు ప్రోత్సాహమిచ్చిన శ్రీ పోలూరి రామమూర్తి మొదలగువార్కి నా అభివందనాలు. యిందులో పాల్గొను ప్రతి నటుడు ప్రతి నటీమణి స్టేజి అనుభవం సంపాదించినవారైతే నాటకం రాణిస్తుందని నా తలంపు. యీ నాటకముయొక్క స్టేజిహక్కులు మినహా కాపీరైటు యొక్క సర్వహక్కులు విజయ పబ్లికేషన్సు ప్రొప్రయిటరు వట్లూరి సత్యనారాయణగార్కి యివ్వట మయింది. పూర్తి స్టేజి హక్కులు నాకు చెందియున్నవి.

సెలవు

మీ

సీ తం రా[illegible]



ర చ యి త :

సీతంరాజు వెంకటేశ్వరరావు

## హెచ్చరిక

ఈ నాటకము యొక్క స్టేజీ హక్కులు నాకు చెంది యున్నవి కనుక నా లిఖిత పూర్వకమైన అనుమతి పొందనిదే ఏ విధంగాను ప్రదర్శింపరాదు. యిందుకు వ్యతిరేకించి ప్రవర్తించువారు నాచే జరుపబడు సివిల్ క్రిమినల్ చర్యలకు బాధ్యులగుదురు.

ఇట్లు
సీతంరాజు (రచయిత)
16/266 సత్యనారాయణపురం విజయవాడ 2,

ఆంధ్రదేశ మందంతటా ప్రదర్శింపబడుచున్న
సీతంరాజ్ ఆర్ట్సు ప్రొడక్షన్సు వారి గొప్ప నాటకములు.

---

| పల్లెపిల్ల | | కులంలేనిపిల్ల |
|---|---|---|
| (రచన: సీతంరాజు) | | (రచన: పినిశెట్టి) |
| దర్శకత్వం: | — | సంగీతం: |
| సీ త ం రా జు | | ర త్నా రా వు |

వివరాలకు :

సీతంరాజ్ ఆర్ట్సు ప్రొడక్షన్సు
సత్యనారాయణపురం, విజయవాడ 2.



# సమర్పణ

దర్శకుడుగా

నిర్మాతగా

ఉత్తమనటుడుగా

పేరు ప్రఖ్యాతులార్జించుకుని "ఆంధ్రా పాల్‌ముని" అని బిరుదును పొందిన

"ఆంధ్రచిత్రకళాచారి"

చిత్తూరు వి. నాగయ్యగార్కి

ప్రేమతో సమర్పించుచున్నాను.

ఇట్లు

సీతంరాజు

# అభిప్రాయాలు.

పల్లెపిల్ల నాటకం చాలా బాగుంది. సర్వేశ్వరుడు మీ కృషికి తోడ్పడి మీకు అన్నివిధాలా జయము చేకూర్చాలి. ఇదే నా ప్రార్థన.

మద్రాసు
15-9-50

(Sd) వి. నాగయ్య
రేణుకా ఫిలింసు లిమిటెడ్.

తమ్ముడూ!

అనుక్షణ పరిణామాలకు లోనౌతూ అభ్యుదయ మార్గాన పరుగులెత్తే నేటి నవ చైతన్య సంఘాని కొక అమూల్య సందేశాన్ని అందిచ్చావు .... మనస్తత్వాల్లోగాని, స్వభావాలలో కాని మానవసమూహాలు విభిన్నాలు కావు. స్వార్థ మానవ కల్పితమైన కులాలు కాలసర్పాలులా బుసలు కొట్టుచూ, విషాన్ని కక్కుచూ వికటాట్టహాసం చేస్తున్నాయి. కులవృక్షాలు కూకటివేళ్ళతో కూలిపోతేనే గాని సంఘానికి మోక్షం లేదు. ఇదే నువ్వు ఆలాపించిన అమరగానం, అందిచ్చిన దివ్య సందేశం. ప్రేమ ప్రాణాన్ని యిస్తుంది. కామం ప్రాణం తీస్తుంది. యీ విజ్ఞాన్ని నిర్భయంగా వెల్లడించావు. భావం చాల నిశితంగా చూపించావు. అనుభవంతో, విజ్ఞానంతో రచనలు సాగించు. మానవాభ్యుదయానికి యితోధికంగా పాటుపడు. హృదయ పూర్వకంగా ఆశీర్వదిస్తున్నాను.

విజయవాడ.
18-3-51

(Sd) K. V. S. శర్మ
"అరుణోదయ"

# పరిచయం

సీతంరాజు గత 10, 15, సం॥నుండి తన నటనతో ప్రేక్షకులను మైమరపిస్తూ హాస్య నటుడుగా నాటక రంగంలో రాణించాడు. యీతనికి మిగతా పాత్రలు ఒకయెత్తు, హాస్యరస వేషాలు వొకయెత్తు. హాస్యంలో గల విశిష్టతను పూర్తిగా అవగాహన చేసుకున్నాడు. హాస్య నటుడుగానే కాక రచయితగా కూడా వెలుగులోకి వస్తున్నాడు. వీరు ప్రథమంగా వ్రాసిన సినిమాజగత్ అనే హాస్య నాటిక ఆంధ్రదేశంలో అనేకచోట్ల అనేక సమాజాల వారిచే ప్రదర్శింపబడి ప్రజాశీస్సులను అందుకుంటోంది. ఈ పల్లెపిల్ల సాంఘిక నాటకం వీరి ద్వితీయ పుష్పం. దీనిలో ప్రజలకు కావలసిన ముఖ్య సందేశాన్ని అందించాడు. యితనిలో గల విశిష్టత తను స్వయంగా వ్రాసుకునే నాటకాల్లో తనకోసం ప్రత్యేకించి వొక పాత్రను సృష్టించుకుంటాడని యితని రచనలనుబట్టి అనిపిస్తోంది. వినోద, విజ్ఞానాలతో కూడిన వీరి రచనలధ్వారా పాఠకుల ఆదరాభిమానాల్ని అందుకుంటున్న ప్రజ్ఞాశాలి. ఏమైనప్పటికి హాస్య నటుడుగాను. రచయితగాను వుజ్వలమైన భవిష్యత్తు వుందని ఆశిస్తున్నాను.

గుడివాడ
13-2-51

ఇట్లు,
వి. నరసింహారావు

# పాత్రపరిచయం



కుమార్

కథానాయకుడు. వయస్సు 25 సం॥లు. నారాయణరావు గారి పుత్రుడు, B. A. B. L.

మధు

అమాయకుడు. తనకు తాను గొప్పవాడని ప్రచారం చేసుకోటంలో అగ్రగణ్యుడు. కుమార్ మిత్రుడు. వయస్సు 25 సం॥

నారాయణరావు

పురాతన పద్ధతుల్నే ఆదర్శంగా పెట్టుకు సంచరిస్తాడు. పేదలపాలిట దయా దాక్షిణ్యాలు ఏ కోశంలోను కనుపించవు. ఆస్తిపరుడు. వయస్సు 50, 60 సంవత్సరముల మధ్య వుంటుంది.

నర్సయ్య

పల్లెవాడు. పద్మ తండ్రి, వృద్ధుడు, వయస్సు 80 సం॥లు

ప్రకాశరావు

నారాయణరావు దగ్గర గుమస్తా. భయస్థుడు. వయస్సు 40

పద్మ

కథానాయకి. పల్లెపిల్ల. ప్రేమించిన ప్రియునికోసం తన తండ్రి మనస్సు పాడుచేసి భూదేవికి అర్పితం చేసిన ప్రణయశీల. వయస్సు 15 సం॥లు.

శోభ

B. A. కుమార్‌ని ప్రేమించి పెండ్లి చేసుకుంది. వయస్సు 20 సం॥లకు మించి వుండవు.

☞ ఈ నాటకంలో 6వ రంగం ప్రథమంలో లైటింగు అవసరం,

## ఈ నాటకంలో అవసరమైన పరికరాలు.

1 బెడ్డింగు - 3 గాజు గ్లాసులు - 3 సాసర్లు - 1 నిలువు టద్దం - 1 చేపలవల - మొలబుట్ట - చేపలమ్మే తట్ట - కోళ్ల గంప - దణ్ణెం - పాతగుడ్డలు - నులక మంచం - గొంగళి - పందుంపుల్ల - కుండ - పత్రిక - డస్కు పెట్టె - కొన్ని పుస్తకాలు - మంచుసీసా - జోలి - వంకికర్ర - టైపు మిషను - ఉత్తరం - ఆరెంజ్ డ్రింక్సుతో 2 గ్లాసులు - చిన్న మందు పొట్లాం మొదలగునవి సందర్భానుసారంగా వాడవలసినవి. అందుకు గాను ముందుగా సిద్ధపరచుకొనుట మంచిది.

---

నిజం చెప్పాల్సివ స్తే ఆ సరస్వతి సంగీతానికన్నా వం కుందిగాని యీ అపర సరస్వతి సంగీతానికి వెతికి చూద్దా మన్నా వంక దొరకదు ........ (శోభతో) హల్లో మైడియర్ శోభా! హార్ట్‌లీ కంగ్రాచ్‌లేషన్స్ - (చేయికలిపి) నిజంగా చెప్తున్నాను. నీ సంగీతానిక్కి వెతికి చూద్దామన్నా ఎబ్బే- వంకదొరకందేనా-

శోభ:- ఓహోహో- ఎక్కడనేర్చుకున్నావ్?

మధు:- ఏమిటి?

శోభ:- అదే-

మధు:- ఏది?

శోభ:- అహ- ఈ డబ్బావాయించటం.

మధు:- (నవ్వి) ఎక్కడ నేర్చుకోవాలి? యిటువంటివన్నీ యీ మధుసూధన పంత్‌గార్కి పుట్టుకతోనే బయద్దేరాయి.

శోభ:- గొప్పవాడివే!

మధు:- నీకంటేనా!

శోభ:- సరేకాని, మధూ! అంతా అయింతర్వా తొచ్చావేం?

మధు:- (నీరసంగా) అయిందీ! అనుకున్నంతా అయింది.

శోభ:- ఏమనుకున్నావేం?

మధు:- యింకేమనుకోవాలి? యితర ఎంగేజ్‌మెంట్సు మూలాన, ఆలస్యంగా బయలుదేరాం కదా - 'శోభాదేవిగారి పుట్టిన రోజు పండుగతాలూకు 'టీ' పార్టీ అయిపోయే వుంటుంది' అని అనుకున్నాను.... యింకేం - వచ్చినదారే తీస్తాను.

(వెళ్లబోతాడు)

శోభ:- వచ్చావుగా వుండు.

మధు:- ఇంకెందుకు?

శోభ:- అడుగుబొడు గేమన్నా మిగిలిందేమో చూస్తాను.

మధు:- (ఆలోచిస్తూ) సరె, చూడు. (అక్కడున్న కుర్చీలో కూర్చొని) ఆ! అన్నట్లు అడగటం మర్చాను. మన ఫ్రండ్స్‌లో ఎవరన్నా నిన్ను ఆసీర్వదించారా!

శోభ:- (వెటకారంగా) నాస్సెన్సు - మనం కోరమని తెలిసే మన ఫ్రండ్స్ మన్ని ఆసీర్వదించలేదు.

మధు:- ఎంతమాట- యిటువంటప్పుడన్నా ఆసీస్సులు చాలా అవసరం. (సకిలించి) సమయానికి నేనే వుంటే....

శోభ:- ఉన్నవాళ్లు నీకంటె కొమ్ములు తిరిగినవాళ్లే!

మధు:- ఎంత కొమ్ములు తిరిగినవాళ్లయినా అందర్నీ మించుతాడు యీ మధు....(అంటూ నవ్వుతాడు)

శోభ:- అరె, మర్చిపోయానే!

మధు:- (అమాయకంగా) ఏమిటి? ఎక్కడ?

శోభ:- ఏముందీ నీకు 'టీ' తీసుకురావటం. (అంటూ వెళ్తుంది)

మధు:- అరెరెరెరె- ఎంత నామర్దా- యీ మధుసూధన్‌పంతుగార్కి యీ వేళ అన్నీ డిజప్పాయింటుమెంట్లే! కొంప తీసి, లేవగానే నా మొహం నేను చూసుకోలేదుకదా!

(కుమార్ ప్రవేశిస్తాడు)

మధు:- (లేచి) హల్లో మైడియర్ కుమార్! (చేయి చేయి కలిపి) కంగ్రాచ్యులేషన్స్. నేనే అనుకున్నాను. నాకంటే బాక్ నొచ్చావే! బ్యూటిఫుల్‌గావుంది - మనకి అడుగు బొడుగు

మిగుల్తుందేమో అనుకున్నాను....పాపం- నీకు ఆ ఆశ
కూడా లేదేమో!

కుమార్:- అందుకు నువ్వాశపడ్డావని, అందరూ ఆశపడతార్రా - బేవార్సు ప్రియుడా!

మధు:- బ్యూటిఫుల్- మంచిరోజు చూసి బలేటైటిల్ పారేశావురా! యిటువంటి అందమైన టైటిల్‌కోసం, ఎన్నో మీటింగుల్లో ఫాల్గొని, వుక్కిరి బిక్కిరి కాకుండా ప్లాటుఫారం పగిలి పోయేట్లు, రీసౌండుతో వుపన్యాసాలు పారేశాను. దేశ దేశాలు, ఖండ ఖండలూ తిర్గాను. కాని, బ్రదర్, ఎవడి కన్నా నీమాత్రం బుర్రుండేడిస్తేగా!

కుమార్:- నిజం చెప్పావురా!

( శోభ టిఫిన్ ప్లేటు, టీ గ్లాసు తీసుకొస్తుంది. )

శోభ:- (సంతోషంతో) అరె, ఎప్పుడు రావటం?

మధు:- కనుపించటల్లా- యిప్పుడే!

(కుమార్ చిరునవ్వు నవ్వాడు)

శోభ:- నిలబడే వున్నారేం? కూర్చోండి.

మధు:- బై మిస్టేక్- చెప్పటం మర్చాను. కూర్చోరా!

కుమార్:- ఓహోహో-ఏం మర్యాద!

మధు:- బ్యూటిఫుల్‌గా అన్నావ్- మర్యాద విషయంలో చెప్పాల్సి వస్తే, ముందు నన్ను, అహహ కాదుకాదు, ముందు శోభా దేవిని, అవిడగారి తర్వాత నన్ను, నా తర్వాత నిన్నూ చెప్పుకోవాలి.

శోభ:- (నవ్వి) అవున్ట- (బెడ్డింగు చూసి) బెడ్డిం గెవర్ది?

కుమా:- నాదే -

శోభ:- ఎందాకా ప్రయాణం?

మధు:- శెలవు లిచ్చారుకదూ - యింటి కెళ్ళొద్దామనేమో!

శోభ:- అదా!

కుమార్:- అవును.

శోభ:- దానికేం- కూర్చోండి. 'టీ' పుచ్చుకుపోదురుగాని.

కుమా:- (టైమ్ చూసి) ట్రైన్ టయమయింది. వెళ్ళాలి.

మధు:- కావలసినంత టైముంది.... అరె కూర్చోరా! మనిద్దరం కలిసి, జల్సాగా, బ్యూటిఫుల్‌గా టీ తీసుకుందాం.

కుమా:- నా బదులు కూడా నువు పుచ్చుకుందూ, నేను పోతాను.

మధు:- No, No, No, No. చస్తే పుచ్చుకోను. మధు ఎప్పుడూ కూడా, ఎదటివాణ్ణి వదిలిపెట్టి, ఎక్కడా ఏదీ పుచ్చుకోడు. (రెక్కపట్టుకు కూర్చోపెట్టి) తీసుకురా శోభాదేవీ!

(శోభ నిష్క్రమిస్తుంది)

మధు:- (రిస్టువాచి చూసుకుంటూ) అరె, నాకు టయమయిందే!

కుమా:- ఎందుకు?

మధు:- బజారు పోవాలి.

కుమార్:- అంత అర్జంటు పనుందేమిటి?

మధు:- బలే వాడివి, మనకి పను ల్లేకపోవట మేమిటి?

కుమార్:- ఏమిటాపని?

మధు:- అట్లా అడుగు .... మా చెల్లికి పీసుమిఠాయంటే భలే యిష్టంలే!

కుమా:- అయితే-

మధు:- పంపించాలి.

కుమా:- (నవ్వి) అందుకని, శ్రీరంగమెళ్లి ఏమిటో తెచ్చినట్లు, యీ వూరునుంచి మీవూరు పీసుమిఠాయి తీసుకుపోతావా!

మధు:-ఎబ్బే- నేవెళ్లను. అసలు నాకు తీరికేది? శంకరంగాడు పోతున్నాడు కామా, వాడికిచ్చి పంపుతాను.

(శోభ టిఫిన్ ప్లేటు, టీ గ్లాసు తీసుకు ప్రవేశిస్తుంది)

కుమా:- క్షమించాలి- 'టీ' తీసుకుంటాను. టిఫెన్ తీసెయ్.

మధు:- పైముందిలేవోయ్- ఏందుకు తొందరపడ్తావ్.

(శోభ టిఫెన్‌ప్లేటు, టీ గ్లాసు కుమార్ ముందు పెడుతుంది)

కుమా:- కాదురా- యిప్పుడే హోటల్లో తీసుకొచ్చాను.

మధు:- అదేమన్నమాట - కొద్దిగానన్నా ఖాళీ వుండకపోతుందీ - చూడు.

శోభ:- బాగా చెప్పావ్. (కుమార్‌తో) తీసుకోండి కుమార్‌గారూ!

మధు:- కుమార్‌గారూ! (శోభతో కలిసి అనాలి)

కుమా:- యెందు కీ బలవంతం?

మధు:- బాగుంది. టిఫిన్ తీసుకోమనటం కూడా బలవంతమే! మనకి పెట్టేవాడంటూ వుండాలికాని, ఎన్నిసార్లన్నా తీసుకుంటాం.

కుమా:- యింకేం! మొత్తం పట్టుబడి పట్టు.

మధు:- నో, నో, ఏదో మాటవరుసకన్నాను కాని-

శోభ:- తీసుకోండి.

(కుమార్, మధు టిఫిన్ తీసుకుంటారు)

మధు:-(టీ త్రాగుతూ) మధు ఎప్పుడూ జపాను గడియారం

లాగా పనిచేస్తూ వుంటాడన్న సంగతి నీకు తెల్సునని నాకు తెల్సును. అంతే, పంతులు గార్కి పనుందన్న మాట. (లేచి) తిరిగి సాయంత్రం కల్సుకుంటాను. (కుమార్‌తో) వెళ్తొస్తారా బ్రదర్!

(నిష్క్రమిస్తాడు)

కుమార్:- (లేచి) కంగ్రాచ్‌లేషన్స్ శోభా! వెళ్తొస్తాను.

శోభ:- తొందరపడతారేం?

కుమా:- టైమ్ అయింది కాదూ!

శోభ:- ఫరవాలేదులెండి.

కుమార్:- వెళ్ళొద్దంటావా!

శోభ:- అని అన్నానా! తొందర్లేదని అన్నాను.

కుమా:- నిన్ననే బయల్దేరుతానని నాన్నకి వైరిచ్చాను. నాకోసం ఉదయం స్టేషనుక్కూడా వచ్చుంటారు.

శోభ:- ఉండచ్చు- ఆ ట్రైన్‌కి మీరు పోలేదుగా! యింకెప్పుడెళ్ళినా ఫరవాలేదు.

కుమార్:- ఎందువల్ల రాలేదోనని గాబరా పడ్తారు.... వెళ్లాలి.

శోభ:- అందుకు నా మనస్సు అంగీకరించటల్లేదు.

కుమా:- అంగీకరించినా లేకపోయినా తప్పనిసరిగా-

శోభ:- వెళ్లాలంటారా!

కుమా:- అవును.

శోభ:- (ఈర్ష్యగా) అయితే మీ యిష్టం.

కుమా:- కోపమొచ్చిందా?....

శోభ:- ఎందుకూ కోపం?

కుమా:- మరి అట్లా వున్నావేం?
శోభ:- ఎట్లావున్నాను? కొత్తగా కనిపిస్తున్నానా?
కుమా:- అనేగా చెప్పటం-
శోభ:- కారణం తెల్సుకున్నారా?
కుమా:- తెలుస్తే అడగటం దేనికి?
శోభ:- అయితే చెప్తా వినండి.
కుమా:- చెప్పండి వింటాను.
శోభ:- మరి కూర్చోండి.
కుమా:- థ్యాంక్ స్ ప్లైమ్.
శోభ:- నే నందిస్తానుగా! ఊఁ - కూర్చోండి.
(కుమార్ కూర్చుంటాడు)
శోభ:- చెప్పమంటారా!
కుమా:- ఊఁ - చెప్పండి.
శోభ:- మరి నే నడిగిన ప్రశ్నలకి సరిగా సమాధానం యిస్తారా?
కుమా:- నిరభ్యంతరంగా!
శోభ:- ఒక అమ్మాయి వుందనుకోండి.
కుమా:- సరె, అనుకున్నా.
శోభ:- ఆ అమ్మాయి వక అందమైన పిల్లాణ్ని ప్రేమించిం దనుకోండి.
కుమా:- అదీ అనుకున్నాను.
శోభ:- అతని ఫాదర్ మరో అమ్మాయిని శెటిల్ చేశాడనుకోండి-
కుమా:- అప్పుడు -
శోభ:- ఆ అమ్మాయి ఏంచేయాల్సి వస్తుంది?

కుమా:- (ఆలోచించి) పెండ్లిచేసుకోవాల్సివస్తుంది.
శోభ:- ఎవర్ని?
కుమా:- వరుణ్ణి.
శోభ:- ఏ వరుణ్ణి? ప్రేమించిన వాణ్ణా - కుదిర్చిన వాళ్లనా!
కుమా:- అవాంతరా లేవీ అడ్డు తగలకుండా వుంటే ప్రేమించిన వాణ్ణే!
శోభ:- తప్పితే కుదిర్చినవాణ్ణా!
కుమా:- అంతకంటె ఏం చేస్తుంది? సర్వం త్యజించి, ప్రేమించిన వాడితో ప్రయాణం కట్టాలి.
శోభ: ఆ!.... ఒకవేళ తండ్రి వప్పుకున్నా అతనే వప్పుకోపోతే?
కుమా:- చేతనైతే వప్పించాలి.
శోభ:- నిరాకరిస్తే!
కుమా:- ఏం చేస్తుంది? నిరసనవ్రతం ప్రారంభించాల్సిందే.
శోభ:- ప్రతిఫలం?
కుమా:- జరుగుతే పెళ్లి - జరక్కపోతే మరణం.
శోభ:- ప్రేమించబడిన అబ్బాయికి ఏది న్యాయమంటారు?
కుమా:- తన్నే కావాలని కాళ్ల దగ్గరకు వచ్చిన పిల్లని పెండ్లి చేసుకోవటమే!
శోభ:- అట్లాగే మిమ్మల్ని ఒకమ్మాయి ప్రేమించిందనుకోండి ....ఏం చేస్తారు?
కుమా:- అంతవరకూ రానీ, చెప్తాను.
శోభ:- వచ్చిందే అనుకోండి.
కుమా:- అయితే మనం అంగీకరించామని కూడా అనుకోండి.

శోభ:- (కుమార్‌ని సమీపించి చెయ్యి పట్టుకుంది.)
కుమా:- (కుర్చీ మీంచి లేస్తాడు.)
శోభ:- కుమార్ ....
కుమా:- చెప్పు శోభా! సందేహిస్తావేం?
శోభ:- మీ చెరణదాసిగా వుండాలని ఎంతకాలంనుంచో ఎదురు చూస్తున్నాను. యీ సంగతి మీకు చెప్పి, ఎప్పుడో మిమ్మల్ని ప్రేమభిక్ష వేడుకుందామనుకున్నాను.... కాని, ఆడదాన్ని కావటంచేత యింతవరకు నా వుద్దేశ్యాన్ని బహిరంగపర్చి, నా సంశయాల్ని తీర్చుకోలేకపోయాను. నన్ను....
కుమా:- పెండ్లి చేసుకోమంటావా?
శోభ:- అనే వేడుకుంటున్నాను.
కుమార్:- (ఆలోచిస్తూ వుంటాడు)
శోభ:- ఎందు కాలోచిస్తారు? మీ రిష్టపడితే ఎంతకాలంనుంచో ఎదురు చూస్తున్న మధురమైన నా కోర్కెలు ఫలిస్తాయి.
(చేయి పట్టుకుంటుంది)
కుమా:- (మాట్లాడడు)
శోభ:- అనుమానిస్తున్నారా?
కుమా:- అ అ అ లేదు. మనం, అ అ పెండ్లిచేసుకుందాం. చూడు, నేను తిరిగివచ్చేలోపుగా మీ ఫాదర్ని కన్సల్టుచెయ్.
శోభ:- మా ఫాదర్ ఎప్పుడూ నా మాట కాదనరు.
కుమా:- (రిస్టువాచి చూసి) ఇక నే వెళ్లిరానా?
శోభ:- ('సరే' అన్నట్లు తలూపి) అప్పుడప్పుడు వుత్తరాలు వ్రాస్తూ

వుంటారు కాదూ?

కుమా:- దానికేం! తప్పకుండా. (నిష్క్రమిస్తాడు)

(శోభ కుమార్ నడచిన మార్గాన్నే చూసి తనలో సంతోషిస్తూ)

— పాట —

శోభ:- మదిగల కోరిక తీరె నా
మదిగల కోరిక తీరె ॥మది॥

చిరునవ్వు మోముతో - వలపంత చూపిస్తు
నన్ను వెంటాడుతూ - నా కోర్కె నెరవేర్చె
నా ప్రభువు నేడు ॥మది॥

అంతులేని ఆనందముతో
మితిలేని నా జీవితమును
రథముగ - నడుపుచు
పయనము చేసెద ॥మది॥

—తెరపడును—

—oo:o:oo—

# పల్లెపిల్ల

## 2 వ రంగము.

(తెరముందు జనం అటూ యిటూ నడుస్తూ వుంటారు. కోడికూత వినిపిస్తుంది. పద్దమ్మ పూరెగుడిశనుండి వుత్సాహంతో పాడుతూ వస్తుంది.)

— పాట —

తెల్లారిందోయ్
తెల్లారిందోయ్ ॥తెల్లా॥
పల్లెదొరా బయలుదేరి
పరుగున పోపో ॥తెల్లా॥
వలను చేత పట్టుకొని
బుట్ట చంక నెట్టుకొని
వేగమే పోపో దొరా
మంచి చేపలు కొనిరా దొరా ॥తెల్లా॥
పల్లెపడుచు లంతాను
చేప లమ్ముకొస్తారు
వేగమే పోపో దొరా
మంచి చేపలు కొనిరా దొరా ॥తెల్లా॥

(పద్దమ్మ. యిదేపాట పాడుకుంటూ పల్లెవాళ్లని నిద్రనుంచి మేల్కొలుపుతూ వుంటుంది. కుమార్ ఆ రోడ్డుమీంచి పోతూవుండగా పద్మని చూస్తాడు. పద్మ పాడుతూ నిష్క్రమిస్తుంది.)

కుమా:- (ఆమె అందాన్ని చూసి మురిసిపోతూ) ఆహా! పోలికని బట్టిచూస్తే ఎవరో పల్లెపిల్లలా గుంది....ఏ పిల్లయితేనేం? బంగారంతో సమానమైన ఛాయ, వంపులు తిరుగుతూ ఆకర్షణీయంగాచేసే ఆమె నృత్యం నన్ను కలవరపెడ్తున్నాయ్. గాత్రం మరపురానంత మాధుర్యంగా వుంది. నిజంగా అమరలోకంనుండి అప్పుడే దిగిన అప్సరసలా గుంది. (ఆలోచిస్తూ) యీ సౌందర్యరాసితో పరిచయ భాగ్యం కల్గటం ఎట్లాగు?....ఆ! మంచి వుపాయమే దొరికింది.... మొహం కడుక్కోటానికి నీళ్లు కావాలనే వంకతో నెమ్మదిగా ఆమె పరిచయం....

(పద్దమ్మ తిరిగి పాడుతూ వస్తుంది. కుమార్ ప్రక్కకు తప్పుకుంటాడు. పద్మ నిష్క్రమిస్తుంది. కుమార్ ఆమెను అనుసరిస్తాడు. అనంతరం తెరెత్తబడుతుంది. పూరిగుడిశ - గుడిశముందు కోళ్లగంప - గంపకింద కోడిపిల్లలు, సమీపానే దణ్ణాన చేపలవల ఆరేసి వుంటుంది. మరోవైపు కొన్ని పాతగుడ్డలు మరో దణ్ణాన వుంటాయి. పద్దమ్మ నాట్యం చేస్తూ అదేపాట పాడుతూ వుత్సాహంతో గుడిశలో జొరపడుతుంది. కుమార్ ప్రవేశించి గుడిశముందు నిల్చుంటాడు. పద్దమ్మ పాడుతూ లోపలినుంచి ప్రవేశించి కుమార్‌ని చూసి పాడటం ఆపి తెల్లబోయి చూస్తుంది)

కుమార్:- భయంలేదు; నేనే.

పద్దమ్మ:- (భయపడుతూ) అదేం టండోయ్. మా పరిశయత్తుడు నాగ 'నానే' అనేసినారు. నానంటే వోరూ అని?

కుమా:- నే నొక బాటసారిని - యీ సమీపాన బస్సు చెడిపోయింది. మొహం కడుక్కుపోదామని....

పద్దమ్మ:- అసలు ఓరు మీరు?

కుమా:- మనుష్యులమే!

పద్దమ్మ:- కులం ఏటని?

కుమా:- బ్రాహ్మణులం.

పద్దమ్మ:- ఏంటీ! బాంబర్లే! అయిబాబో—

కుమా:- ఏం?

పద్దమ్మ:- అయితే దొరా! బాంబర్లకి మా నీళ్లెట్టా యిత్తాను. పాపంకాదూ?

కుమా:- ఫరవాలేదు, యివ్వచ్చు.

పద్దమ్మ:- తప్పు దొరా! బాపనోళ్లకి మా నీళ్లిత్తే బమ్మచ్చ పాతకం సుట్టుకుంటాదని మా అయ్య సెప్పాడు; యియ్యను.

కుమా:- పోనీ అంత అనుమానంగా వుంటే, మజ్జిగ చుక్కేసి....

పద్దమ్మ:- యియమంటారా?

కుమా:- అవును.

పద్దమ్మ:- (ఆలోచించి) సరె, యిత్తా - మజ్జిగ సుక్కేసి_తె తప్పు నేదు. వుండుదొరా - పట్టుగొత్తా (గుడిశలోకి పోతుంది)

కుమా:- ఆహా! ఎంత అందంగావుంది.

పద్దమ్మ:- (చిన్న కుండతో నీళ్లతెచ్చి) యియిగో దొరా! (అంది స్తుంది)

కుమా:- (అందుకుంటూ) నీపేరు?

పద్దమ్మ:- పద్దమ్మ.

కుమా:- చక్కటిపేరు. పేరుకుతగ్గ రూపం. (మొహం కడుక్కొని

కుంఠ పద్దమ్మ కందిస్తూ) వెళ్లొస్తాను.

పద్దమ్మ- అదేంటి బాబోయ్. మీరు మాసెడ్డ మంచోరునా గున్నారే! కారు శెడిపోయింది గందా, అప్పుడే ఎల్లి ఏటి శేత్తారు? కాసేపు కూకునిపొండి.

కుమా:- ఏ కుల మయితేనేం? మంచి మర్యాద వుండాలిగాని —— (కూర్చుంటాడు)

పద్దమ్మ:- మా అయ్య సెప్పాడు, యింటి కోరన్నా వత్తే గౌర్త సేయాలని.

కుమా:- అయితే పద్మా!

పద్దమ్మ:- హె - అదికాదు నాపేరు. ప-ద్ద-మ్మ.

కుమా:- దానికంటె యిది చాలా బాగుంటుంది. ఏది, అను - 'పద్మ' అని.

పద్దమ్మ:- (అనలేక అవస్తపడి) పద్మ.

కుమా:- ఆ! అది. యీ పేరు బాగుళ్లేమా!

పద్దమ్మ:- సాలా బాగుంది. (కుమార్‌కి కొంచెం దూరంలో కూర్చుంటుంది)

కుమా:- అయితే పద్మా! పాట చక్కగా పాడగలవుకద. యీ పూరిగుడిశల్లో, యీ పెంటపోగుల్లో, యీ చేపల వాసన్లో వుండకపోతే ఏ సినీమాల్లోకన్నా పోకపోయావా?

పద్దమ్మ:- అదేటండోయ్. నే నే శమ్మా ఎరగను. మొన్నదేటో వత్తేను, పల్లెపిల్లలంతా ఒక్కతూ రెళ్లాం. (ఆశ్చర్యంగా) అదేటో దొరా! అందులో మరీ యిపరీతంగా వుంది.

కుమా:- ఏం?

పద్దమ్మ: ఏంటి దొరా - మీ బాపనోళ్ల బుల్లా డెళ్ళి, మాలోళ్ల పిల్లతో శొలాల్లోనూ, డొంకల్లోనూ సికార్లుకొట్టి, ఆ యమ్మిని పట్నం కొట్టుకెల్లి పెల్లిసేసుకుండాడు.

కుమా:- (నవ్వి) యింతేకదా; యిప్పుడు అన్నిచోట్లా జరుగుతూనే వున్నాయ్.

పద్దమ్మ:- నిజంగానా దొరా!

కుమా:-నిజం. కాని, నే నన్నది ఆ సినిమాకాదు. అందులో వేషాలు వేయటానికి-

పద్దమ్మ:- మానెద్ద సిరాగ్గా శెప్పారే - న న్నోరు తీసుకుంతారు?

కుమా:- ఎందుకు తీసుకోరు? రూపానికి రంభవి.

పద్దమ్మ:- ఆ! అంశే ఏటి దొరోయ్?

కుమా:- అందంగా వున్నావన్నమాట - పాటా, కమ్మగా పాడగలవ్ - నీకు ఏం లోటుందని తీసుకోరు?

పద్దమ్మ:- కాదుదొరా! ఆళ్లు తీసుకుంతేమాత్తరం మా అయ్యూరుకుంపద్దూ?

కుమా:- ఏం? మీ అయ్యకి డబ్బు చేదా?

పద్దమ్మ:- అదికాదు - అక్కడ ఆడోళ్లు నీతిగా వుండరని బయం-

కుమా:- ఉంటారు, వుండరు - అది నీకెందుకు? నీకు నీవు నీతిగా వుంటేసరి.

పద్దమ్మ:- ఛీ ఛీ. ఎంతుకులే దొరా! నా నెల్లను. ఆల్లల్లో పోకిరీ వోళ్లుండి, ఆళ్లమీద యీళ్లు, యీళ్లమీద ఆళ్లు సేతులేసుకు తిరుగుతారంట - అయన్నీ సూత్తే నాకు రోతగా వుంటుంది. నాకొద్దు పాడుజాతి.

కుమా:- జాతికో పనేముంది? నీతి, నియమం వుండాలికాని. (లేచి) వెళ్లిరానా?

పద్దమ్మ:- మా అయ్యొచ్చేదాకా వుండు దొరా!

కుమార్:- వెళ్లాలి. రేపు ఎల్లుండ్లో తప్పకుండా వస్తాను, సరేనా? (పోబోతాడు)

పద్దమ్మ: మీరు బలే సర్దా గలోరండి - మిమ్మన్ని సూత్తే అదేటో నాకు బలే నవ్వొత్తుంది.

కుమా:- అట్లాగా! ఆ! నిన్ను చూస్తే మాత్రం నవ్వు రాదేం?

(యిద్దరూ నవుతూండగా నర్సయ్య ప్రవేశించి వీళ్లనిచూసి తెల్లబోయి చూస్తూ వుంటాడు)

కుమా:- తీరుబడి చూసుకొని రేపు ఎల్లుండిలో వస్తాన్లే.

(నిష్క్రమిస్తాడు)

పద్దమ్మ:- (కుమార్ వెళ్లిన మార్గాన్నే చూస్తూ వుంటుంది.)

నర్సయ్య:- (నెమ్మదిగా వెనకాలవచ్చి) పద్దమ్మా!

పద్దమ్మ:- (వులిక్కిపడి) అ అ అ అ - ఏంటయ్యా!

నర్సయ్య:- ఎవడే యీడు?

పద్దమ్మ:- ఓరయ్యా!

నర్స:- ఓగా! యిప్పుడిక్కడ నీతో మాట్టాడినోడు.

పద్ద:- ఆయనగారా! ఓరో సదువుకున్న బాంబర్లంట -

నర్స:- ఈడ కెందుకొచ్చాడు?

పద్ద:- కారులో ఎల్తుంటె, ఆ కారు పట్టీ కొట్టింసట. మొగం కడుక్కు యెళ్దామని-

నర్స:- అయితే యీడ కెందుకు రాటం?

పద్ద:- నీళ్లు కావాలంటూ-

నర్స:- వచ్చాడా?

పద్ద:- అవునయ్యా!

నర్స:- యిచ్చావా!

పద్ద:- యిచ్చాను.

నర్స:- ఏంటీ! బాంబర్ల కే నువు నీ ళ్లియ్యటం. ఎంత పాపం శేశావే తల్లీ :

పద్ద:- అదేంటయ్యా - నీళ్లి_స్తే పాపమా?

నర్స.- అదికాదమ్మా - బాంబర్లంటే బమ్మదేవుడితో సమానం కదా, ఆళ్లకి మన పల్లెకోర్ల నీళ్లి_స్తే మనకి పాపంకాదు తల్లీ!

పద్ద:- ఆ మాటే శెప్పానయ్యా - మట్టిగ నుక్కేసి_స్తే తప్పు నేనని సెప్పి తీసుకుండారు.

నర్స:- అయితే సరవా నేదులే తల్లీ....సరేగాని, ఏంటే - మీరిద్దరూ ఒకటే నవ్వు నవ్వుతుండారు?

పద్ద:- నాపాట బాగుందని, నేను బాగుండానని, నన్ను శమ్మాల్లోకి ఎల్లమంటుండారు....నే కాదన్నాను .... అయ్యా ! ఆయనగోరు బలే సరదాగల మడిశయ్యా ! ఆయనగోరి మాటలు యింటున్నకొద్దీ యినా లనిపిత్తున్నాయ్.

నర్స:- ఆ! ఏంటీ! (తెల్లబోతాడు)

పద్ద:- అవునయ్యా ! నా పేరు బాగుస్లేదని (ఆలోచించి) 'పద్మ' అని మార్చారయ్యా.

నర్స:- ఏంటీ, పేరు మార్చాడా!.... పేరు మార్చాడా.... పద్దమ్మా

.....ఎట్రా! (దగ్గిరకు తీసుకొని బుజ్జగిస్తూ) పెద్దోళ్ళని, ఆళ్ళ మాటల్ని నమ్మకూడదమ్మా - ఆళ్ళేటన్నా మాట్టాడు తారు. దేనికన్నా తెగిత్తారు. ఆళ్ళ మాటలు నీళ్ళల్లో మూటల్తో సమానమే తల్లీ!

పద్ద:- అదేంటయ్యా - అట్టాఅంటావ్ ? ఆయన సాలా మంచోడు నాగ కనుపిత్తుంటేను. ఆయన సెప్పే మాటలు యింటుంటే-

నర్స:- వద్దమ్మా వద్దు. యియ్యాల మాటలు తియ్యగా మాట్టాడి రేపు కనుక్కు సంపాయించుకొని, ఎల్లుండి మనస్సిర్సేసి. అవతల రోజు తప్పుదార్ని నడుత్తారమ్మా - ఆళ్ళకి మనస్సిచ్చి మాట్టాటం సాలా తప్పు తల్లీ!

పద్ద:- (తెల్లబోయి నెమ్మదిగా) మనువిచ్చి మాట్టాట్టం తప్పా?

నర్స:- నిజంగా తప్పే తల్లీ.

పద్ద:- అట్టాయితే సరెలే అయ్యా. అసలే మాట్టాణ్ణు.

నర్స:- అంతేనమ్మా అంతే - అట్టాగే వుండాలి. మనువిత్తే నెత్తి నెక్కుతారు - ఎక్కినోళ్ళని దింపాలంటే సాలా కట్టపడాలి.

పద్ద:- అవునయ్యా - అంతే.

నర్స:- కాకపోతే, పల్లె పల్లెంతా ఆడిపోత్తుంది. పద్దమ్మా ! నే సెప్పింది శెప్పినట్టు మనసులో వుంచుకో తల్లీ! యింటి కోకన్నా వత్తే ఎంతవరకు గౌర్త సేయాలో అంతవరకే శేయాలి. ఆళ్ళమాటలు గాల్లో మేళ్ళే తల్లీ!

తెరలో:- నర్సయమామా!

నర్స:- ఆ! వత్తుండారా పుల్లిగా! దబ్బున గంజికాయి తల్లీ! పుల్లిగాడితో మాట్టాడొత్తాను. (నిష్క్రమిస్తాడు)

పద్ద:- (ఆలోచిస్తూ వుంటుంది)

'(పెద్దోళ్ళ మాటలు నీళ్లల్లోమూటలు తల్లీ)' అన్న తండ్రిమాటలు తల్చుకుంటుంది.

పద్ద:- ఏంటీ! పెద్దోళ్ళ మాటలు నీళ్లల్లో మూటలే ! అయ్య సెప్పింది నిజమేనేమో - (ఆలోచించి) ఆలోచించి సూత్తే మా అయ్య సెప్పినట్టు ఆళ్ల మాటలన్నీ గాల్లో మేడలే అనిపిత్తోంది.

(నెమ్మదిగా తెర జారుతుంది)



# పల్లెపిల్ల



## మూడో రంగం

(నారాయణరావు ఆఫీసుగది - నారాయణరావు స్పెన్సర్ సిగరెట్ కాలుస్తూ పత్రిక చదువుతూంటాడు - ప్రక్కగా చాప, దానిమీద దస్కం పెట్టి వుంటుంది. ప్రకాశరావు ఏవో లెఖ్ఖల పుస్తకాలు తిరగేస్తూ వుంటాడు)

(తెర ఎత్తబడును)

ప్రకా:- సార్! (సమీపిస్తాడు)

నారా:- ఏం?

ప్రకా:- రావుబహద్దూర్ రంగనాధంగారి మేనల్లుడిగారి గుమాస్తా గురునాధం నిన్ననే వచ్చి డబ్బు జమకడతా నన్నాడు; యింతవరకూ రాలేదు.

నారా:- అందుకని?

ప్రకా:- ఏం చేయమని తమ శెలవు?

నారా:- ఎంత చక్కగా అడిగావయ్యా? ఏం చేస్తావ్? యిస్తానన్న రోజుకి యివ్వకపోతే వణకు పుట్టేటు నోటీసు పారెయ్యటమే -

ప్రకా:- పాపం, బీదవాడండి.

నారా:- జాలి తల్చి వూరుకోటానికి వాళ్ళేం వుచితార్ధంగా యిస్తు

న్నావా?

ప్రకా:- చిత్తం.

నారా:- ఏమిటి చిత్తం - నీ మొహం చిత్తం.

ప్రకా:- అవునండి.

నారా:- ఆ! చూడు, నిన్న బాంకునుంచి తెచ్చినదబ్బు తీసుకెట్టావా?

ప్రకా:- చిత్తం.

నారా:- రేపు పెళ్లింట్లో కోర్టులో హీరింగులేమన్నా వున్నాయేమో తెల్సుకున్నావా?

ప్రకా:- లేవండి.

నారా:- అన్నట్లు మర్చిపోయాను. మొన్న అబ్బాయి వస్తున్నానని వైరిచ్చికూడా రాలేదు. ఎందుకు రాలేదో తెలియదు, చూడు ప్రకాశం! వైరిచ్చి కులాసాగా వుందీ లేందీ తెలుసుకో.

ప్రకా:- అలాగేనండి.

(తలుపు చప్పుడు)

ప్రకా:- (గుమ్మం వైపు చూస్తూ) ఏవరది? .... అదుగో అబ్బాయి గారు.

నారా:- వచ్చాడా! (సంతోషంతో ఎదురై) ఏరా నాయనా! (కుమార్ ప్రవేశించి నారాయణరావ్ పాదాలకు నమస్కరిస్తాడు. నారాయణరావు ఆనందంతో లేవనెత్తుతాడు)

ప్రకా:- (సంతోషంతో) అబ్బాయిగారికి వెయ్యేళ్లాయుష్షు - మాట ల్లోనే వచ్చారు కాబట్టి-

కుమా:- (నవ్వుతాడు)

నారా:- ఒంట్లో కులాసాగా వుందా నాన్నా? (కూర్చుంటాడు)

కుమా:- కులాసాగానే వుంది నాన్నా. (కూర్చుంటాడు)

ప్రకా:- అదే ఆనందం. (కూర్చుంటాడు)

నారా:- మొన్ననే వస్తానని వైరిచ్చికూడా రాలేదేంరా?

కుమా:- మా క్లాసుమేటు తన పుట్టినరోజు పండగని, బయల్దేరిన వాణ్ణి బలవంతాన ఆపుచేసింది. అందుకని రాలేకపోయాను.

ప్రకా:- అబ్బాయిగారూ! చదువు పూర్తయినట్లేనా?

కుమా:- ఇంకో సంవత్సరానికి అవుతుంది.

ప్రకా:- అంతా ఆ పరాత్పరుని దయ.

నారా:- కాదూమరి - ఆ సంవత్సరంకూడా అయిపోతే మద్రాస్ లోనే ప్రాక్టీస్ పెడుదువుగాని, యీ లోపుగానే మంచి సంబంధం చూసి పెండ్లి చేస్తాను.

ప్రహా:- హిహిహిహి - అబ్బాయిగారు మంచి తెలివైనవారండి. మావాడూ వున్నాడు - ఎందుకూ పనికిరాని మొద్దు. వేలకు వేలు పోసి చదివించటం కనిపిస్తోంది కాని, వాడిదుంపతెగ! వాడొక్కొక్క క్లాసు కనీసం రెండేళ్ళన్నా దండయాత్ర కొట్టందే పాసవడుకదా!

కుమా:- ఇప్పుడేం చదువుతున్నాడు?

ప్రహా:- ఇరవై అయిదేళ్ళకి ఫిఫ్తుఫారం ఏడుస్తున్నాడు.

కుమా:- ప్యాసయితేనా?

ప్రహా:- అయితే యింకేం - మావాడేను.

నారా:- ఇంకేం, బుఱ్ఱకి గట్టిపడుతుందిలే.

ప్రహా:- ఏం పాడోనండి. అసలు మావాడు ఒకనాడైనా పుస్తకం

ముట్టిన పాపాన పోతేగా. జూలాయి వెధవలాగా సిగరెట్ కాలుస్తూ, కాలరెత్తి పోజులిస్తూ తిరగరా అంటే, తిరుగు తాడు. యింతకీ చదువంటే శ్రద్ధుండాలి పంతులుగారూ! అసలు అది వాళ్లకి పుట్టుకరావాలి. యింతెందుకు, కుమార్ గారు చూడండి, యిట్టే చిచింద్రీలాగ పాసవుతూ B. A. B. L. కోర్సు కూడా పూర్తిచేసి పారేస్తున్నారు. నిజం చెప్పాలంటే అబ్బాయిగార్కి వున్న తెలివితేటల్లో ఆవగింజంత భాగమన్నా మా వాడికుందేమో.

కుమా:- మీ వాడి కున్నంత యెక్స్పీరియన్స్ నాకుందా?

ప్రకా:- దండయాత్ర కొట్టటంలోనా? (విచారంగా) వాడి భవిష్యత్తుని గురించి మా ఆవిడ తీరుబడి దొరికినప్పుడల్లా చింతిస్తూ వుంటుంది. అంతకంటే ఏంచేస్తాము? యిదంతా మా గ్రహ చారం. (తనలో) మాటల సందర్భంలో అసద్దే మర్చి పోయానే! (నారాయణరావుని సమీపించి) సార్! యీ వేళ కాస్త తొందరగా యింటికిపోవాలి....

నారా:- ఏం?

ప్రకా:- రాత్రి మాయింటికి చుట్టాలొచ్చారు. యిప్పుడే మా యింట్లో యిబ్బందికూడా వచ్చింది; వెళ్ళి కాస్త వంటపనులు చూసు కోవాలి.

నారా:- ఆనక్క వచ్చేటప్పుడు రావలసిన బాకీలన్నీ వసూలు చేసుకురా.

ప్రకా:- చిత్తం. (కుమార్‌తో) వస్తానండి అబ్బాయిగారూ! (కుమార్ 'సరె' అన్నట్లు తలూపుతాడు. ప్రకాశరావు చన

డస్కు తాళం వకసారి లాగిచూసుకొని విశ్రమిస్తాడు. కుమార్ సమీపానవున్న పత్రిక అందుకొని చూస్తూ వుంటాడు

నారా:- నాయనా! నువు మద్రాస్ వెళ్లింది మొదలు యిప్పటివరకూ రోజొక యుగంగా గడిపాను. ఏమీ తోచేది కాదు. నువ్వు లేకపోతే ఎంతోమంది లేనట్లుగా వుండేది. నేనుకూడా నీ దగ్గరే వుందామా అంటే, గుమాస్తా తెలివైనవాడుకాడు. మన ఆస్తిని ధర్మసత్రంచేసి లోకులపాలు చేస్తాడేమోనని భయం. యింకో సమత్సరం ఎట్లా గడుపుతానో ఏమో!

కుమా:- నిజం నాన్నా! నాకూ అట్లాగేవుంది. చదువు పాడౌతుందని, తప్పనిసరిగా వెళ్లలేక వెళ్లాను కాని -

నారా:- అవున్నాయనా! .... నేను పంపినడబ్బు సరిపోయిందా? రూమ్‌రెంటు, హోటలుఫీజు, అన్నీ పూర్తిగా యిచ్చావా?

కుమా:- ఇచ్చాను నాన్నా!

నారా:- నా చిట్టితండ్రి మళ్ళీ పట్నం వెళ్లేలోపుగానే నాతో సరిసమానమైన ధనికుల పిల్లని చూసి పెండ్లి చేస్తాను.

కుమా:- అంత తొందర పడ్తారేం? యీ సమత్సరం కూడా పూర్తి కానివ్వండి....

నారా:- అదేం, యీలోపుగా చేసినా తప్పులేదు. కాకపోతే కోర్సు కంప్లీటయి, ప్రాక్టీస్ పెట్టాకనే కాపరానికి తీసుకొద్దాం.

కుమా:- అప్పుడే చేస్తే బాగుంటుంది.

నారా:- ఎప్పుడు చేసినా తప్పులేదు. (కంట తడిపెడ్తూ) నీ తల్లి యీ భాగ్యానికి నోచుకోలేదు. నాకైనా ఆ అమూల్య

అవకాశాన్ని కల్గించు. కళ్లారా చూసి ఆనందిస్తాను. పెద్ద వాణ్ణయ్యాను. బ్రతికినంతకాలం బ్రతకను.

కుమా:- (విచారంగా) నాన్నా విచారించకండి. మీ మాటప్రకారమే నడుస్తాను. అదే నా జీవితానికి చుక్కాని.

నారా:- (కౌగలించుకొని) పితృవాక్య పరిపాలనకి ఆదర్శ పురుషుడ వనిపించుకో బాబూ ! నీ వంటి వుత్తమ పుత్రుణ్ణి కన్న మీ అమ్మ ధన్యురాలు!

కుమా:- అంతా మీ ఆసీర్వచన ఫలమేకదూ.

(గోడగడియారం 12 గంటలు కొడుతుంది)

నారా:- పన్నెండైంది. రా నాన్నా - భోజనం చేద్దాం. (నిష్క్రమిస్తాడు)

కుమార్:- (తెల్లబోయిచూస్తూ) నాన్నకు నేనంటే అపరమితమైన ప్రేమ. ఆయనమాట జవదాటాలని నాకెప్పుడూ లేదు. పెండ్లి చేస్తానంటే నే నెలా కాదంటాను. కాని మద్రాసులో శోభ నన్ను ప్రేమించింది. పల్లెగూడెంలో పల్లెపిల్ల-పద్మని నేను ప్రేమించాను. పద్మ శోభకంటె తను అందంగా వున్నానని హెచ్చరిస్తూ నా హృదయంలో తాండవిస్తోంది. పద్మ రూపవతి. పల్లెజాతిలో పుట్టి పెరుగుతున్న పసిడి బొమ్మ.... శోభ చదువుకున్న పిల్ల .... నాన్న మాటల్ని బట్టి చూస్తే రెంటికీ వప్పుకునేట్టు లేదు. (సిగరెట్ ముట్టించి) పద్మని పెండ్లిచేసుకుంటే సంఘం నన్ను, నన్నుబట్టి నాన్నని బహిష్కరిస్తుంది .... పల్లెపిల్లయినా యెంత నీతిపరురాలు .... ఆమె అమాయకపు హృదయం

నన్నిట్టే ఆకర్షించింది. క్షణ క్షణానికి ఆమె చిలిపి మాటలు, హాయి కల్గించే ఆమె గాత్రం నా చెవుల కంటి నట్టున్నాయ్.... ఎవరి ప్రేమ పవిత్రమైనదో ఎవర్ని పెండ్లి చేసుకోవాలో? (తెరపడుతుంది. వెంటనే పద్మ బుట్ట చంకన పెట్టుకొని పాటపాడుతూ చేప లమ్ముకుంటూ ప్రవేశిస్తుంది)

పద్మ:- చేపలో యమ్మ చేపలూ.

పాట

ఒలే ఒలే చేపలు
మంచి మంచి చేపలు
రక రకాల చేపలమ్మ చేపలు
మంచి, విడువరాని చేపలమ్మ చేపలు ॥ఒలే॥

(వచనం) ఉప్పుచాప, పండుకప్ప, మట్టగిడిశ మరి వాలగ
అంతకంటె కొర్రమేను - దానికి మించిన గండె ॥చేప॥
కని, విని, ఎరుగనట్టి - కమ్మనైన చేపలు
పల్లెదొర్ల చేపలు - పసందైన చేపలు ॥చేప॥

(జనం అటూ యిటూ నడుస్తూ వుంటారు - పద్మ వాళ్లకి చేపలు చూపిస్తూ పాడుతూ వీధి వీధి తిరుగుతూ వుంటుంది. అనంతరం)

మా దొర యియ్యాల పెందరాళే రమ్మన్నాడు. యిప్పటికే సాల పొద్దోయింది. వచ్చి, నాకోసం ఎదురు సూత్తుండా రేమో - (గంప కుదించి చూసి) యింకో యీనెడు శాపలున్నాయ్. అయి కూడా అమ్మేసి మా దొరని కల్సు గుంటా - (అదే పాట పాడుతూ నిష్క్రమిస్తుంది.)

(ఖాళీ బుట్ట చంకన పెట్టుకుని పుస్తకం చూస్తూ ప్రవేశిస్తుంది.)

"శ్రీరాముడు సీతతోను, లక్ష్మణుడితోనూ అరణ్యమున కేగెను. ఈ సంగతి సోదరుడైన భరతునకు తెలిసి వుగ్రుడయ్యెను." (అవే మాటలు తిరిగి చదువుతూ వుంటుంది.) నా దొర యింకా రానేదే! సెప్పటం మాత్తరం నాకంటె ముందే వత్తానని శెప్పారు; ఏరి? అసలే అంతు లేందే........ మా అయ్య శెప్పినట్టు మంచోడు కాదేమో (సూర్య కిరణాలు కళ్ళల్లో పొడవకుండా వుండేట్టు చేయి అడ్డు పెట్టుకు చూస్తూ) కంటిసూపు అందేదాకా సూశాను; ఏడి? అంతు నేందేనా! పనేదో తగిలుంటుంది. నేకపోతే రోజూ వచ్చి కల్సుకునే నా మారాజు యియ్యాల ఎందుకు రాడు. సరే, ఏటి సేత్తాను. కూకునిపాటమన్నా సదువుకుంటా.

(పాఠం చదువుకుంటూ వుంటుంది. కుమార్ వెనకనించి వచ్చి కళ్ళు మూస్తాడు.)

పద్మ:- ఏం టా స్వతంత్రం?

కుమా:- ఎవరో చెప్పుకో!

పద్మ:- సూణ్ణిత్తేగా సెప్పుకుంటానికి.

కుమా:- చూస్తే నువ్వే చెప్పాలా? ఎవరైనా నోటితో చెప్తారు గాని, కళ్ళతో చెప్తారా?

పద్మ:- (నవ్వి హేళనగా) ఇంతేనా మీకు తెల్సింది. మళ్ళీ సదువుకున్న మారాజులు. కళ్ళతో ఎవళ్ళో సూసి, నోటితో

సెప్తారు.

కుమా:- ఇంతేనా నీ తెలివితేటలు ? (విడుస్తాడు)

పద్మ:- అమ్మ దొంగా! మీరేనా! (నవ్వుతుంది)

కుమా:- ఎవరనుకున్నావ్? (నవ్వుతాడు)

(కోయిల కూత విన్పిస్తుంది.)

కుమా:- చూడు! ఆ గండుకోయిల ఎట్లా వెక్కిరిస్తోందో!

పద్మ:- అదేంటండోయ్, మీరు మా యిద్దూరంగా సెప్తారే! కోయి లేంటి? ఎక్కిరించటమేంటి?

కుమా:- అందులోనే వుంది మజా. కోయిల పాడుతుంది; ఎక్కిరిస్తుంది; ఏడ్చేవాళ్ళని నవ్విస్తుంది; నవ్వే వాళ్ళని ఎక్కిరిస్తుంది, ఏడిపిస్తుంది.

పద్మ:- (ఆశ్చర్యంగా) అదేంటి దొరా! ఎప్పుడూ నా కొక్క కూతే యినిపిత్తాదే-ఇవన్నీ ఎట్టా సేత్తుంది? మీ మాట లేటన్నా నమ్మతగ్గవేనా?

కుమా:- అవును. అన్నీ నేర్పుతాను. నిన్నొక చదువుకున్న పిల్ల లాగ మారుస్తాను.

పద్మ:- అయి బాబో ! అయితే దొరా! యీ కట్టమంతా మీ కెందుకు?

కుమా:- పిచ్చిపిల్ల ! ఎందు కేమిటి? అన్నీ నేర్పి నిన్ను........ నిన్ను పెండ్లి చేసుకుంటాను పద్మా!

పద్మ:- (తెల్లబోయి) ఆ! (నెమ్మదిగా) పెల్లి సేసుకుంటారా?

కుమా:- అవును పద్మా! నిన్నూ, నీ సౌందర్యాన్నీ చూసి మురిసి పోతూ తీయని కలలు కంటున్నాను. నిన్ను నా దానిగా

చేసుకుంటాను. ఎన్నో రోజుల్నుంచి మనం ఎంతో స్వతంత్రంగా సంచరిస్తున్నాం. కాని, నా ఆత్మ సందేశాన్ని నీతో చెప్పలేకపోయాను. ఇప్పుడు చెప్పకుండా ఉండలేకపోతున్నాను. (చెయ్యి పట్టుకొని) నీ పవిత్ర ప్రేమ భిక్షకోసం యాచిస్తున్నాను.

పద్మ:- (గాబరాపడుతూ) వద్దు దొరా వద్దు. మీరు పెద్ద మారాజులు. మేం పల్లెవాళ్ళం. మనం పెల్లి సేసుకుంటే మీ అ య్యోరుకుంటాడా? మా అయ్య నన్ను బతకనిత్తాడా?

కుమా:- భయం లేదు పద్మా! మనస్ఫూర్తిగా నిన్ను ప్రేమిస్తున్నాను. నా ప్రేమ భిక్షకోసం ప్రార్థిస్తున్నాను. అగ్నిసాక్షిగా పెండ్లి చేసుకుంటాను. మనం అదర్శ దంపతులై పవిత్ర ప్రేమకు కులం, మతం అనే విభేధాలు లేవని ప్రపంచం ప్రతిధ్వనించేట్లు గర్జిద్దాం. నా మాట విను.
(తెరలో నరసయ్య 'పెద్దోళ్ళ మాటలు గాలిలో మేళ్ళే తల్లీ' అంటాడు)

పద్మ:- అవును .... పెద్ద కులపోళ్లు మోసగాళ్లని, ఆళ్లమాటలు గాల్లో మేళ్లని మా అయ్య శెప్పాడు.

కుమా:- లేదు. మోసంచేయను. భగవంతునిమీద ప్రమాణం చేసి చెప్తున్నా.

(చేతిలో చేయి వుంచుతాడు)

పద్మ:- (ఆలోచించి) అట్టాఅయితే మా అయ్యనడిగి శెప్తా దొరా!

కుమా:- వద్దు పద్మా! వద్దు. మీ అయ్య సమ్మతించడని నాకు తెల్సును. నీకు వచ్చిన భయంలేదు. నేటినుండి ఆ సూర్య

చంద్రుల సాక్షిగా నువు నా భార్యవి.

పద్మ:- మాది తక్కువ కులం దొరా! (నెమ్మదిగా అంటుంది)

కుమా:- పిచ్చిపిల్లా! పెండ్లికి కావలసింది గుణంకాని, తాలిబొట్టు కాదు ప్రధానం. హృదయాలు కలవటమే ముఖ్యం. ప్రేమకు కుల విచక్షణతో పనిలేదు. మనకు కులం, పెద్దల మాటల్తో పనిలేదు. మనది ప్రేమకులం.

(దగ్గరకు తీసుకుంటాడు)

పద్మ.- (భయంతో విడిపించుకోవాలని ప్రయత్నంచేస్తూ) వద్దు దొరా, వద్దు. మా అయ్య కీ సంగతి తెలిత్తే తాటికమ్మని సీల్చినట్టు సీలుత్తాడు, వద్దు.

కుమా:- నిన్ను వదిలి వక్కక్షణం వుండలేను. మనం ప్రేమించు కున్నట్లు, ప్రమాణాలు చేసుకున్నట్లు కొంతకాలంవరకూ మూడో కంటివాడికి తెలియనివ్వద్దు.

పద్మ:- మనం దాద్దామనుకుంటున్నా యిటువంటివి దాగవు దొరా! (తెరలో 'అరేయి బుల్లోడా! ఓ బేడ పుగాకు ముక్కలు తేరా!' అని వినిపిస్తుంది)

పద్మ:- (భయంతో తొందరగా) ఎవళ్లో వత్తున్నారు. యిడవండి. (అంటూ విడిపించుకు పారిపోతుంది. కుమార్ ఆమెను పట్టుకోవాలి అన్న ప్రయత్నంతో వెంబడిస్తాడు—

# పల్లెపిల్ల

## నాలుగో రంగం

(నారాయణరావు ఆఫీను గదిలో కూర్చుని  టైప్ చేస్తూ వుంటాడు. తెర నెమ్మదిగా లేచును. అనంతరం ప్రకాశరావు కొంత రికార్డు తీసుకు ప్రవేశిస్తాడు)

నారా:- ఏమయ్యా - బాకీ లేమన్నా వసూళ్లయినాయా?

ప్రకా:- లేదండి.

నారా:- ఎందువల్ల?

ప్రకా:- ఏముందండి. యీ సంవత్సరం ప్రతివాడికి గడ్డుగానేవుంది.

నారా:- అంటే!

ప్రకా:- కందుల కోటయ్య పెద్దవడ్డీ యిచ్చుకోలేనని, అసలు లోంచే కొంత తగ్గించమని ప్రాధేయపడుతున్నాడండి.

నారా:- దమ్మిడీ తగ్గించటానికి వీల్లేదని గట్టిగాచెప్పు. అక్షరాలా- అంటే నోటు వ్రాసిన ప్రకారం వడ్డీ అసలు ఫాయిదాలతో సహా చెల్లించాల్సిందే నని ఖచ్చితంగా ఢంకా బజాయించి మరీ చెప్పు. వినకపోతే ఒక్క రిజిష్టరీనోటీసు పారేయించు.

ప్రకా:- పాపం! వక్కసారిగా యిచ్చుకోలేడనుకుంటాను. చాలా బీదవాడు.

నారా:- నీ మొహం; మళ్ళీ నీ యేడుపుకూడా ఏమిటి? ముందు మంచిసంమీద అసలువదిలి వడ్డీ వసూలుచెయ్. తర్వాత పదిరూపాయలు ప్లీడరుకిచ్చి, గట్టిగా నోటీసు గుద్దించామా అంటే, మళ్లీ వడ్డీ అసలుఫాయిదాలతోసహా మన నోటు మనకే వసూలవుతుంది.

ప్రకా:- చిత్తం. అల్లాగే చేస్తాను. (దగ్గరగాపోయి చేతులునలుపుతాడు)

నారా:- ఏమిటి?

ప్రకా:- జీతం యింకా యివ్వలేదండి.

నారా:- అని తెలుసు.

ప్రకా:- కాస్త....

నారా:- ఈ నెలకూడా జరగనియ్, రెండునెల్లదీ వక్కసారిస్తాను. (సిగరెట్ అంటిస్తాడు)

ప్రకా:- చిత్తం. తమదయ. యింట్లోమాత్రం చాలా యిబ్బందిగా వుంది.

నారా:- లేని వాళ్లెవరు?....సరేగాని, ప్రకాశం! అబ్బాయికి శెలవ రోజులుకూడా సమీపించినై. యీ హాలిడేస్‌లోనన్నా తప్పనిసరిగా పెండ్లి చేసితీరాలి.

ప్రకా:- చిత్తం.

నారా:- నీ ఎరికలో మంచి సంబంధమేదన్నా వుంటే చూడు.

ప్రకా:- సమయానికే గుర్తొచ్చింది.

నారా:- ఎక్కడన్నా వుందా?

ప్రకా:- ఏమిటండీ?

నారా:- సబంధం.

ప్రకా:- లేదు.

నారా:- మరి గుర్తుకొచ్చిందేమిటి?

ప్రకా:- అబ్బాయిగారి ప్రవర్తన.

నారా:- ఏం?

ప్రకా:- ఏ మీ బాగుల్లేదు.

నారా:- ఎందుకని?

ప్రకా:- చెప్తున్నాను వినండి. మీ దగ్గర చాలాకాలంనుంచి పని చేస్తూ, మిమ్మల్నే ఆశ్రయించుకు బ్రతుకుతూ, మీ వుప్పు పులుసు తింటూ యింతవరకు కాలం గడుపుతున్నాను.

నారా:- అయితే!

ప్రకా:- ఏ ముంది. యీనాడు మీ కగౌరవం కల్గితే వకటీ - నాకు కల్గితే వకటా?

నారా:- ఏ మొచ్చింది?

ప్రకా:- గొప్ప ప్రమాదమే సంభవించింది.

నారా:- ఆ! మన కే ప్రమాదం?

ప్రకా:- అవును సార్! ముందు అబ్బాయిగార్కి, వార్ని గురించి మీకు....

నారా:- సంగతేమిటో చెప్పు.

ప్రకా:- మన వూరికి కొద్ది దూరంలో నాగంచిపాడు అనే పల్లె గూడెం....

నారా:- ఆ!....ఉంది.

ప్రకా:- ఆ గూడెంలో ఒక పల్లెపిల్లను మన కుమార్ మనసారా ప్రేమించి-

నారా:- పల్లెపిల్లనా!

ప్రకా:- అవును. దాంతో ప్రణయకలాపాలు జరిపి, దానికి పెండ్లి చేసుకుంటానని మాటిచ్చి, చదువు సంధ్యలు నేర్పి, నవ నాగరికురాల్నిగా తయారు చేశారనిన్నీ....

నారా:- తర్వాత—

ప్రకా:- ఏముంది? అది దానితండ్రికి తెలియకుండా అబ్బాయి గారితో వాళ్లవూరు సమీపానవున్న పూలతోటల్లో వెన్నెల రాత్రుల్లో కల్సుకుంటూ, ప్రణయగీతాల్ని ఆలాపిస్తూ, పరస్పరాలింగనంతో లోకాన్నే మైమరచి .... అబ్బ .... చెప్పటానికి వీలుకానంత అవినీతిగా ప్రవర్తిస్తున్నారట.

నారా:- ఎంతమాట—

ప్రకా:- చిత్తం, యింకావుంది. వీళ్లిద్దరి ప్రణయరహాశ్యం పల్లె ప్రజలకు తెల్సి, వాళ్లు మీ అబ్బాయిగార్ని కొట్టటానికి వచ్చినట్లూ, తమరు భయపడి అబ్బాయిగార్ని పట్నం పంపినట్లు, వూరంతా మారుమ్రోగి పోతోంది. "బ్రాహ్మణుని కొడుకు పల్లెపిల్లతో ప్రణయం సాగించాడు" అంటూ ఒకటే ఎకఎకలు, పకపకలూను.

నారా:- నిజంగానా!

ప్రకా:- నిజంగానేనండి-వినలేక విసుగెత్తిపోతోందంటే నమ్మండి.

నారా:- ఎవరు చెప్పారు ప్రకాశం?

ప్రకా:- ఒకరు చెప్పాలా సార్! అటు పల్లె పల్లెంతా ఆడిపోస్తు

న్నారు. యిటు మన బజార్లో మాత్రం - అబ్బబ్బ, ఒక చోటా....

నారా:- సాటివాళ్లల్లో కూడా అలజడి బయలుదేరిందా!

ప్రకా:- ఇంకా బయలుదేరటమేమిటి సార్! "కులవిచక్షణ లేకుండా అవినీతి జర్గుతూ, అందుమూలకంగా జాతికే కళంకం జర్గుతూవుంటే, చూస్తూ ఎల్లా వూరుకుంటాం" అంటూ సాటివాళ్లు తొందర్లోనే తమర్ని (నెమ్మదిగా) బహిష్కరించాలని బయలుదేర బోతున్నారు.

నారా:- అబ్బాయి అంత నీచానికి పాల్పడ్డాడంటే నేను నమ్మలేకుండా వున్నాను.

ప్రకా:- వక్కసారి మీరు అలా బజార్లోకి వెళ్లిచూడండి. లోకులు కూసే కారుకూతలు వింటే, అప్పటికైనా మీకు నమ్మకం కల్గుతుందేమో!

నారా:- అయితే యిదంతా యదార్ధమే నంటావా?

ప్రకా:- ఎంతమాట - తమదగ్గర నాకు పరిహాసమా!

నారా:- నా కొడుకు నన్ను కాదని, నాకు తెలియకుండా బ్రాహ్మణీకం భ్రష్టత్వం చేస్తాడా? (విచారిస్తాడు)

ప్రకా:- విచారించకండి. మించి పోయిం దేమీ లేదు.

నారా:- యింకా యేం చేయమంటావు ప్రకాశం?

ప్రకా:- మన ప్రయత్నం మనం చేస్తే సాధించలేనిదంటూ లేదు. అబ్బాయిగారి వివాహానికి యిప్పటికైనా ప్రయత్నాలు జరిపితే ఏ చిక్కూ వుండదు, లేకపోతే ముందు ముందు మరీ చిక్కుల్లో పడతాం.

నారా:- అనుకున్న పైంకి సంమ్మంధం దొరకటం అంత తేలికా? ఎట్లా చేస్తాను?

ప్రకా:- ఈ విషయంలో నామాట తమరు విన్నారూ అంటే అన్నీ సానుకూలంచేసి....

నారా:- ఏం చేయమన్నావు?

ప్రకా.- ఏది ఎట్లావున్నా, అబ్బాయిగార్ని వెంటనే పిలిపించండి.

నారా:- పిలిపించి?

ప్రకా:- పెండ్లి చేయటమే!

నారా:- అనుకున్నప్పుడు సమంధాలు....

ప్రకా:- మన ప్రయత్నం మనం చేస్తేసరి - తప్పకుండా దొరుకుతుంది.

(మధుసూధనపంత్ ఒక చిన్న సూటుకేసు ఒక చేత్తోను, మరో చేతితో వంకికర్ర పట్టుకొని దిక్కులుచూస్తూ ప్రవేశించి)

మధు:- నారాయణరావు గారి భవనం యిదేనాండీ?

ప్రకా:- అవును.

మధు:- ఐ సీ- (ఆఫీసు నాల్గుమూలలా చూస్తూ బ్యూటిఫుల్ సార్! బ్యూటిఫుల్!—— ఎంతబాగుంది.

ప్రకా:- ఏమిటి?

ప్రకా:- భవనం——

నారా:- కూర్చోండి.

(మధు కూర్చుంటాడు)

నారా:- మంచితీర్థం కావాలా?

మధు:- No, No, No. అవసరంలేదు. జస్టు యిప్పుడే కాఫీ పుచ్చుకున్నాను.

నారా:- తమరు వచ్చినపని?

మధు:- తొందరపడకండి. నారాయణరావుగారు లోప లున్నట్లున్నారు.

ప్రకా:- వారే— (చూపిస్తాడు)

మధు:- వారా! అ రె రె రె రె - ఎంత పొరపాటు (నమస్కరించి) నమస్తే సార్!

నారా:- నమస్తే!

ప్రకా:- మీది—

మధు:- Madras.

నారా:- ఏం చేస్తూవుంటారు.

మధు:- యీ సంవత్సరమే చదువుకు స్వస్తి చెప్పాను. ప్రస్తుతం నేను చేసేపని ఎక్కే గుమ్మం దిగే గుమ్మం.

ప్రకా:- అంటే?

మధు:- అంటే, వుద్యోగం సంపాదించటానికి ఆఫీసులు చుట్టూ తిరిగి ప్రయత్నించట మన్నమాట.

నారా:- ఫలితం పొందారా?

మధు:- అదే వుంటే అర్ధంకాని తిరుగుడుతో పనేముంటుంది?

ప్రకా:- చంపేశారు.

మధు:- అ హి హి - అంత పనొద్దు.

నారా:- మా కుమార్ని ఎరిగున్నారా?

మధు:- బ్యూటిఫుల్‌గా అడిగారు.

నారా : ఏం?

మధు:- మీ వాణ్ణెరక్కపోవట మేమిటి?

ప్రకా:- తెలుసు నన్నమాట.

మధు:- అసలు మేమిద్దరం రూమ్‌మేట్సుం.

నారా:- అలా చెప్పండి.

మధు:- యిప్పుడు అతని పనిమీదే వచ్చింది.

నారా:- అబ్బాయి కులాసాగా వున్నాడా?

మధు:- ఎంతమాట - బ్యూటిఫుల్‌గా వున్నాడు. మీ వాడి దగ్గర అంత బ్యూటీ వుంది కాబట్టే, ఆ చలపతిరావుగార్కి మీ వాణ్ణి కాస్తా కాజెయ్యాలని బుద్ధిపుట్టింది.

ప్రకా :- ఏమిటీ!

మధు:- ఆ కోర్కెతోనే నన్నిక్కడికి పంపారు.

నారా:- చలపతిరావు గారెవరు?

మధు:- ఎవరేమిటి? మీ వియ్యంకుడు. (ఉత్తరం అందిస్తూ) యిదిగో -

ప్రకా :- (ఉత్తరాన్ని అందుకొని నారాయణరావుకు అందిస్తాడు)

నారా :- (ఉత్తరంచూస్తూ)

మహారాజరాజశ్రీ నారాయణరావు పంతులుగార్కి.

అభివందనాలు.

మీ పుత్రుడు జయంత్‌కుమార్ నా అనుంగు పుత్రిక శోభని ప్రేమించినట్లు చూచాయగా గ్రహించాను. వాళ్ళిద్దరి ప్రేమ సంతోషమే. మనకూ సంతోషం. అందువల్ల నేను వ్రాయునది ఏమనగా దయవుంచి మీరెట్టి అభ్య

తరం పెట్టక శోభా కుమార్ల ప్రేమని ఆశీర్వదించి, వాళ్ళ వివాహానికి వొప్పుకొంటారని ఆశిస్తూ, వాళ్ళకి నిర భ్యంతరంగా పెండ్లి చేయాలనే కుతూహలంతో వున్నాను. కనుక మీ వుద్దేశ్యాన్ని సదుద్దేశ్యంగా యీ శుభవార్త తెచ్చిన మధుసూధన్ పంత్‌గారి ద్వారా....

మధు:- హిహిహిహి - అవునండి.

నారా:- తెలియపరుస్తారని ఆసిస్తున్నాను.

ఇట్లు
భవదీయుడు,

మద్రాసు
15-3-50

వెంట్రప్రగడ చినిచెలపతిరావు వ్రాలు

(మధుతో) ఈ ఉత్తరం అబ్బాయిని ఆలోచించే వ్రాశారా?

మధు:- అని అన్నారు.

ప్రకా.- అంటారనే అనుకున్నాను. (నారాయణరావుని సమీపించి రహస్యంగా) అవకాశం దొరికినప్పుడే ముడిపెట్టం మంచిది. ఆలోచించండి.

నారా:- స్తితి గతులు తెలుసుకో.

ప్రకా:- గౌరవ ప్రపత్తులు కలవారేనా?

మధు:- నన్నే అడిగేది?

ప్రకా:- అవును. యింకెవర్ని?

మధు:- అయితే వినండి. ప్రస్తుతం వారు వుంటున్న మేడ మాత్రం వారిదని మాత్రం నాకు తెల్సును .... అది తప్ప వేరే ఆధారమేమీ లేదనే నా నమ్మకం. అయినా తమరు విచారిస్తే మంచిది.

ప్రకా:- కట్నం యివ్వగలరా?

మధు:- అదేమిటండి? ప్రేమించుకున్నాక పాదుకట్నం అడ్డొస్తుందా? ఏవో వారికి శక్తి వున్నంతవరకూ యిస్తే యివ్వనూవచ్చు - లేకపోతే లేకపోనూవచ్చు.

ప్రకా:- అదేమిటండి! మీ రిచ్చే సమాధానాలు గోడమీది పిల్లి వాటంగా వున్నాయే.

మధు:- పిల్లివాటంగా వున్నాయా? పామువాటంగా వున్నాయను కున్నానులే.

ప్రకా:- నే నన్నమాటకు కోపం వచ్చిందనుకుంటాను.

మధు:- ఇంకా అనుకోట మేమిటి? మధ్యవర్తిగా వచ్చిన సన్యాసికి మంచి బుద్ధి చెప్తున్నారు.

ప్రకా:- మే మడగటం తప్పా?

మధు:- ఎబ్బే - నేను రావటమే తప్పంటాను.

ప్రకా:- ఆ మాట మీరెందు కనుకోవాలి?

మధు:- నేను అనుకోపోతే మీ రనుకోవాలా?

ప్రకా:- అవసరమైన ప్రశ్నలు వేయటం....

మధు:- ఆ అడ్డదిడ్డ ప్రశ్నలతో నాకు నిమిత్త మేమిటి?

నారా:- ఆ పెద్దమనిషి ఉత్తరంలో డిటేల్సుగా వ్రాయకపోతే అడిగామ్;అందులో ఆక్షేపణేమీ లేదే!

మధు:- నాకు పూర్తిగా ఆక్షేపణగానే కనిపిస్తోంది.

నారా:- మీ రలా అనుకుంటే మే మేం మాట్లాడలేం. క్షమించండి....ప్రకాశం ఆ పెద్దమనిషితో డిటేల్సుగా వ్రాయమని.

ప్రకా:- ఖబురు చేయమంటారా?
నా రా:- ('ఔను' అన్నట్లు తల వూపుతాడు.)
ప్రకా:- చిత్తం....(మధుతో) పంతులుగారూ! మీ పేరేమిటో....
మధు:- ఏమిటో కాదు. నాపేరు వెధవది మధుసూధన్‌పంత్ అంటారు.

ప్రకా:- అయితే మధుసూధన్ పంత్‌గారూ! దయయుంచి వారితో వారి స్థితిగతులను గురించి విపులంగా వ్రాయమని చెప్పండి.

మధు:- (కోపంతో) డామ్‌సారీ - మధ్య మీ రెవరు? అసలువారి మాట కావాలి. (నారాయణరావుతో) ఏమంటార్‌సార్! బ్యూటిఫుల్‌గాచెప్పండి. చెవిని పడేసుకు చల్లగా దారితీస్తాను.

నారా:- డీటేల్సుగా వ్రాయమని చెప్పండి. మావాణ్ణి కూడ ఆలోచించి అలాగే చేద్దాం. కాని, పంతుగారూ! నాకు కావలసింది పెద్దకట్నం అని మాత్రం మీరు మర్చిపోకుండా మనస్సులో వుంచుకోండి.

మధు:- బాగా చెప్పారు. మానవ జీవితానికి నిస్సందేహంగా కావలసింది ఒక్క డబ్బేనని మీ మాటల్ని బట్టి అర్థం చేసుకున్నాను. సంతోషంగా యీ మాటే చెప్తాను. (వెళ్లబోతాడు)

ప్రకా:- ఆ!—పంతుగారూ - మరోవిషయం -
మధు:- ఏమిటి?
ప్రకా:- అమ్మాయిని చూడాలన్నారనికూడా చెప్పండి.
మధు:- ఏయ్! వట్టి బ్రూట్‌లాగున్నావే! నువ్వు చూశేదేమిటి

నీ బొంద! వధూవరు లిద్దరూ వొకరి నొకరు బ్యూటి ఫుల్‌గా చూసుకుంటే చాలదూ?

ప్రకా:- (విసుగ్గా) పానకంలో పుడకలాగా మధ్య నీ గొడవేమిటయ్యా— అయ్యగా రన్నారని చెప్పు.

మధు:- పైగా యివొకటా! నువ్వని ఆ పెద్దమనిషిమీద అబద్ధమాడమంటావ్? నా స్సెన్స్. (నారాయణరావుతో) అబద్ధమాడటమంటే ఏమిటోఎరగనుసార్! మాట్లాడే మాటల్లో నేప్పుండాలని మీ గుమాస్తాతో చెప్పండి. (సిగరెట్ ముట్టించి) వెళ్లొస్తా సార్! (సంచి, గొడుగు తీసుకుంటూ వుంటాడు)

ప్రకా:- (నారాయణరావుతో రహస్యంగా) అన్నట్లు మర్చిపోయాను— మనం అబ్బాయిగార్ని ఎల్లాగూ పిలిపించాలనుకుంటున్నాం కదూ, వారిద్వారానే పిలిస్తే బాగుంటుందేమో.

నారా:- నిజమే—(మధుతో) మధుసూధనపంత్‌గారూ! అయిదారు రోజుల్లో వీలుచేసుకొని అబ్బాయి నొకసారి రమ్మని చెప్పండి.

మధు:- దానికేం! తప్పకుండా చెప్తాను .... అసలు తను యీ పాటికి రావలిసిందే....

నారా:- వస్తానన్నాడా?

మధు:- అనటమేమిటి? నాల్గు రోజులనుంచి ప్రయాణమవుతున్నాడు.

ప్రకా:- అయితే మీ రిక్కడకు వస్తున్నారని అబ్బాయికి తెలుసా?

మధు:- ఏయ్ -మిస్టర్! ను వ్వడక్కు_, నిన్నుచూస్తే నా కెట్లాగో వుంది.

నారా:- నే నడుగుతున్నాను.

మధు:- తెలియదు.

నారా:- ఈ కోపంగా వస్తే సరే సరి. లేకపోతే తప్పక రమ్మన మని చెప్తారు కదూ?

మధు:- బ్యూటిఫుల్ గా చెప్తాను.

నారా:- ఈ పూట.........

మధు:- నో నో నో నో, నన్ను నిర్బంధించకండి. ఐ హావ్ గాట్ అనదర్ ఎంగేజ్ మెంట్ ఎట్ గాంధీనగర్....వస్తాను!

నారా:- మీ యిష్టం - పోనీ కాఫీ అన్నా....

మధు:- దానికేం, తప్పకుండాను. అదేమిటో కాఫీ ఎన్నిసార్లు త్రాగినా త్రాగాలనిపిస్తుంది. అయినప్పటికీ క్షమించండి. తొందర పనుంది. (నిష్క్రమిస్తాడు)

నారా:- అనుకున్నంతా అవుతోంది.

ప్రకా:- అల్లా అంటున్నారేం?

నారా:- కాకపోతే పదిరోజుల కోసారి వాడి కీ వూళ్ళో పనేమిటి?

ప్రకా:- నేను చెప్పలేదూ సార్! యిదంతా పెద్ద గ్రంథమని.

నారా:- సరే కానియ్, ఆ గ్రంధం ఎంతవరకు వస్తుందో చూస్తాను ...మర్చిపోయాను, ప్రకాశం!

ప్రకా:- అయ్యా!

నారా:- కందుల వర్తకుడు కాశేశ్వరరావుని నేను రమ్మన్నానని పిలిపించు.

ప్రకా:- చిత్తం..... (నిష్క్రమిస్తాడు.)
(తిరిగి నారాయణరావు యధావిధిగా సైపు చేస్తూంటాడు. కుమార్ ప్రవేశం)

నారా:- ఎప్పుడు రావటం?

కుమా:- ఇప్పుడే వస్తున్నాను నాన్నా!

నారా:- మొన్ననేగా వెళ్ళింది.

కుమా:- అవును.

నారా:- తిరిగి వెంటనే రావటానికి కారణం?

కుమా:- చూసి పోదామనే!

నారా:- ఎవర్ని?

కుమా:- మిమ్మల్నే!

నారా:- యింతకాలంనుంచీ లేని ప్రేమ, అభిమానం, యిప్పుడే వచ్చిందా!

కుమా:- అలా అనకండి మీరంటే ఎప్పుడూ నా కభిమానమే, ఎప్పుడూ ప్రేమే. లోగడ మిమ్మల్ని చూడకుండా ఎక్కువ కాలం గడిపేవాణ్ణి - అ గడపటం కూడ ఎంతో కష్టంమీద.

నారా:- యిప్పుడు అసలే గడపలేకుండా వున్నావ్-అవునా?

కుమా:- ('అవును' అన్నట్లు తలూపుతాడు,)

నారా:- పాపం-నే నంటే నీకు ఎంత ప్రేమ. పిచ్చివాడా! పిల్లి పాలు త్రాగుతూ ఎవ్వరూ చూడలేదనుకుంటుందిట....నా వంక వక్కసారి చూడు.

కుమా:- (చూస్తాడు)

నారా:- నిజం చెప్పు - వారాని కోసారి నువ్విక్కడికి ఎందు కొచ్చేదీ నాకు తెలుసు.

కుమా:- ఎందుకు?

నారా:- ఎందుకా - ఆ పూల తోటల్లో పరువు ప్రతిష్ఠలు లేని పల్లె పిల్లతో....

కుమా:- (పెద్దగా) నాన్నా! (నెమ్మదిగా తెల్లబోయి చూస్తూ) పల్లెపిల్ల—

నారా:- ఏం! అబద్ధమా!

కుమా:- ఎందుక్కాదు?

నారా:- నిజం చెప్పు.

కుమా:- (మాట్లాడడు)

నారా:- (పెద్దగా) మాట్లాడవేం?

కుమా:- అవును - పల్లె పిల్లతో సరసా లాడుతున్న మాట నిజమే. పల్లెపిల్లని ప్రేమించాను-ఆమెకు నా హృదయాన్ని కాను కగా యిచ్చాను - కాని అందుకే వచ్చాననుకోటం కేవలం పొరపాటు.

నారా:- ఇంతకీ పల్లెపిల్లని ప్రేమించావన్నమాట.

కుమా:- అవును.

నారా:- (హేళనగా) మరి పెళ్ళెప్పుడు?

కుమా:- మీ ఆశీర్వచనముంటే చాలు. ఎప్పుడో ఒకప్పుడు జరిగి తీరుతుంది.

నారా:- వేళాకోళమనుకుంటున్నావా?

కుమా:- లేదు.

నారా:- ఏమిటా సమాధానం!

కుమా:- ఏం? ఇందులో తప్పేముంది?

నారా:- లేదూ-సరిగా ఆలోచించు.

కుమా:- లేదనే నా నమ్మకం.

నారా:- అయితే అదికూడా వెంటనే కానిచ్చెయ్.

కుమా:- ఏమిటది?

నారా:- పెండ్లి.

కుమా:- (సంతోషంతో) నాన్నా-మీరేనా అంటున్నది. మీ మాట ప్రకారం తప్పకుండా చేసుకుంటాను. పద్మ ప్రేమదేవత. శాంతిమూర్తి.

నారా:- (పెద్దగా) కుమార్! నేను మాట్లాడేది నిజం కాదు. నువ్వా పల్లెపిల్లను పెళ్లి చేసుకుంటానికి వీలుపడదు. మనం బ్రాహ్మణులం, నేను సనాతనాచారాలకు కట్టు పడ్డాను. సంఘం దానికి హర్షించదు - నా మాట విను.

కుమా:- విన్లేను, వినను, వినవలసిన అగత్యం లేదు.

నారా:- కుమార్!

కుమా:- నేను చేసింది తప్పు కాదు. ప్రేమించాను, పెండ్లి చేసుకుంటాను.

నారా:- తర్వాత జీవించటానికూడా....

కుమా:- నిర్భయంగా జీవిస్తాను.

నారా:- నా ఆస్తితో నీకు సంబధం వుండదు.

కుమా:- కష్టపడటానికి రెక్కలున్నాయి.

నారా:- అది నీకు జయం కాదు.

కుమా:- విజయం.

నారా:- కులంనుంచి బహిష్కరించపడ్తావ్ -

కుమా:- ఆపని ముందు నేనే చేస్తాను. ప్రేమజీవుల్నిచూసి వోర్వలేక, కులం, మతం అంటూ అడ్డొచ్చే పాపిష్టి సంఘాన్ని నేనే బహిష్కరిస్తాను.

నారా:- నోర్ముయ్.

కుమా:- (మాట్లాడడు)

నారా:- ఆఖరిమాట - నామాట వినదల్చుకుంటేనే నువ్వీయింట్లో కాలుపెట్టు - వీలుపడకపోతె తెగతెంపులు చేసుకువెళ్లిపో-

కుమా:- మీ హృదయం పాషాణంతో సమానమైంది. సంఘం, కులం, ఆచారం, అంటూకన్న కొడుకుమీద జాలి, కరుణ లేని కఠినగుండె మీది. నావల్ల మీకు అప్రతిష్ట కల్గుతే నేనిక్కడవుండవలసిన పనిలేదు. నానుండి మీరు బాధపడవలసినపనీలేదు. నన్ను మర్చిపోండి. శెలవు. (వెళ్లబోతాడు)

నారా:- నిలు - (కుమార్‌ని బుజ్జగిస్తూ) నాయనా! నీమాటే నీది గాని, పెద్దవాణ్ణి నామాట వినాలని నీకు ఏ కోశంలోను లేదన్నమాట.

కుమా:- వింటాను. కాని, యీ విషయంలో వినలేకుండా వున్నాను. నా మనస్సు నా నుండి వేరయింది.

నారా:- అయితే మాత్రం పల్లెపిల్లని ప్రేమించి, పెండ్లి చేసుకొని పవిత్రమైన మనవంశం అపవిత్రంచేసి పాడుచేస్తావా!

కుమా:- లేదు. పద్మ సాంప్రదాయంకలపిల్ల - పల్లెవాళ్లల్లో తప్పి పుట్టింది. అందకత్తె.

నారా:- తప్పే పుట్టిందో తప్పకే పుట్టిందో తర్వాత సంగతి; ఎంత అందమైన పిల్లయినా మనకంటే తక్కువ కులంలో పుట్టింది.

కుమా:- పవిత్రప్రేమకు కులం అంటూ లేదు.

నారా:- ప్రేమ! కులం!! చిన్నతనంనుంచి ని న్నేవిధంగా పెంచి పెద్దవాణ్ణి చేశానో నీకు తెలియన్ది కాదు. తాతలనాటి నుంచీ వస్తున్న మన వంశమర్యాదల్ని వృద్ధిచేయాలి. మన అన్నం మనమే తిన్నా సంఘానికి కట్టుపడుండాలి. అందుకనే పల్లెపిల్లని........

కుమా:- నాన్నా! నామాట వినండి -

నారా:- అనవసరం - ను వ్వేమీ చెప్పఖ్ఖర్లేదు. నాకు కావలసింది సంఘం. నే నెప్పుడూ దాన్ననుసరిస్తూవుంటాను. ను వ్వా పాపిష్టి పల్లెపిల్లతో తైతక్కలాడుతూవుంటే చూసి సహించి వూరుకోటం కష్టసాధ్యం - దానికి మన సంఘం వప్పుకోదు. సంఘా న్ననుసరించటం మానవులధర్మం.

కుమా:- సంఘం - సంఘం - సంఘం - పాపిష్టి సంఘం ! నీతిలేని సంఘం!! ఎదుటివాణ్ణిచూసి వోర్వలేనిసంఘం!!! సనాతనాచారాలకు దాసోహమని ప్రగల్భాలు కొట్టుకునే పాపిష్టిసంఘం!

నారా:- (పెద్దగా) ఆపు -

కుమా:- ఇంకేమీ చెప్పద్దు....

నారా:- పెద్దవాణ్ణి - తండ్రిని- నామాట వినరా! చూడు. తక్కువ కులంలో పుట్టిన పడుచుని పెండ్లాడటం మారణ అగ్నిగుం

డాలకు మార్గం వెతుక్కోటమేరా! సాటివారిలో పుట్టుకు అందమైనవాళ్లు లేరా?

కుమా:- ఎవరంపం వాళ్లదే - నా కంటికి మల్లెపువ్వు యింపుగా వుంటే మీ కంటికి గులాబిపువ్వు యింపుగా వుంటుంది. మరొకడికి మరోపువ్వు - అట్లాగే -

నారా:- (బాధగా విచారంతో) చిన్నతనంనుంచీ నామాట నిరాక రించెరగవ్. ఇప్పుడీవిధంగా ప్రవర్తించటం, నీకు గౌరవ మేమో ఆలోచించు. కన్నతండ్రి కన్నీటిధారలతో కృంగి కృసించిపోవటం నీకు జయంకాదు.

కుమా:- కన్న కుమారుని కోర్కె చెల్లించకపోవటం తండ్రికి మాత్రం గౌరవమా?

నారా:- కాదు....చూడు....మనకున్న పరువు ప్రతిష్టలకు నువ్వు యీవిధంగా పల్లెపిల్లను పెండ్లిచేసుకొంటే, మనగౌరవం ఏం కావాలి? అవినీతికి పాల్పడి బజారు పాలపటం భ్రష్ట త్వం కాదూ? ఇప్పటికే మనగౌరవం నీ మూలాన కొంత వరకు మట్టిపాలైంది. వూరు వూరంతా అనేకవిధాలుగా తూలనాడుతోంది. అవన్నీ నీ కేం తెలుస్తాయి? తెలుసు కోవాలని వుంటే ప్రకాశరావుని అడుగు, అన్నీ చెప్తాడు.

కుమా: ప్రకాశరావు, హుం! అవును: విన్నసంగతి చెప్తాడు. అనుకునేవాళ్లకి జ్ఞానంలేకుండా పక్షప్రాయంగా అను కుంటే వినే వెర్రివెధవలకి విడ్డూరంగా కనుపించదూ? తక్కువకులంవాళ్లని ప్రేమిస్తే తప్పని చెప్పే మన సంఘాలు అందుకే అంత అధోగతిపాలౌతున్నాయి.

నారా:- సంఘాన్ని అనవసరంగా నిందించకు. వస్తు తెలియని వ్యామోహంలో పడి, కళ్లు పొరఖకప్పి, పల్లెపిల్ల ప్రేమ పాశంలో బంధింపబడ్డ నీకు అట్లాగే కనిపిస్తుంది. మానవుడు మంచిని సంపాదించటం కష్టం. చెడ్డనిపించు కోవటం తేలిక.... మే మంతా సంఘమని, సంఘనియమా లని, వాటికి కట్టుబడి వుండుటచేతనే ఇంతటివాళ్లమయ్యా మని తెల్సుకో. మనమే మనసంఘాల్ని, సంఘ నియ మాల్ని పాటించకుండా వాటికి ద్రోహంచేస్తే, ముందు ముందు యిన్ని పచ్చిమంచినీళ్ళకుకూడా నోచుకోమని తెల్సుకో .... నాయనా! .... నామాట విని సంఘాన్ని, శాస్త్రాల్ని, ఆదర్శంగా పెట్టుకు సంచరించు.

కుమా:- ప్రేమీ - ప్రేమికులకు సంఘంతో పనిలేదు. వాళ్లకి కనుపించేదల్లా ఒక్క పవిత్రమైన ప్రేమ — వాళ్లు ఆరాధించేదికూడా ఆ పవిత్రప్రేమనే. ప్రపంచమంతా వాళ్లకి ప్రేమమయంగా కనిపిస్తుంది.

నారా:- కనుపిస్తుంది, కనుపించదూ? అందుకని, పల్లెపిల్లని పెండ్లి చేసుకొని, దాంతో తలెత్తుకొని కాపురం చేస్తావా? ఇంత చదువు చదివి, ఇంతజ్ఞానం సంపాదించి, చివరకు వాటి ఫలితంగా యిదా నీవు చేసేపని?(దగ్గరకు వెళ్లి) నా మాట విను తండ్రీ!

కుమా:- వినను....వినలేను....క్షమించండి. పల్లెపిల్ల ప్రేమ పవిత్ర మైనది.

నారా:- (నవ్వి) పల్లెపిల్ల....ప్రేమ.... పవిత్రమైనది!....కుమార్!

ఇంక నేను సహించలేను. (విచారంతో బరువుగా) నా మాట వినదల్చుకొని, నా గౌరవానికి భంగం కల్గకుండా వుంచ దల్చుకుంటే, ఆ పల్లెపిల్ల పేరు ఎత్తకు. (కోపంగా) లేకపోతే—నీకూ, నాకూ తండ్రీ కొడుకుల సంబంధం తెగిపోతుంది......

కుమా:- (పెద్దగా దుఃఖంతో) నాన్నా!

నారా:- ఇంకేమీ వినదల్చుకోలేదు.

కుమా:- మీ గౌరవానికి భంగం కల్గచేసినందుకు, మీ పరువు ప్రతిష్టలు, పాడుచేసి మీకు సంఘంలో విలువతగ్గించి మీకు వ్యతిరేకంగా వుంటూ మీ కొడుకు ననిపించుకోవటం, మీకు నామీద కష్టంగానే వుందని గుర్తించాను. ఇప్పటి కైనా క్షమించి నన్ను మరచిపోండి. (వెళ్లిపోవును)

నారా:- నాయనా (సమీపించి) నామాట వినరా! పెద్దవాడిని, నీ క్షేమంకోరి, మన గౌరవంకోరి చెప్తున్నాను. విను.

కుమా:- (మాట్లాడడు)

నారా:- మరొక్కసారి ఆలోచించు. కోరినంత కట్నంతో అపరూప సుందరి నీకు అర్ధాంగి కాబోతున్నది.

కుమా:- మీ మాటలు వినలేకుండా వున్నాను.

నారా:- అవును. లేకపోతే నీవు నాకు పుట్టలే దనుకొంటాను. నా ఆస్తిపాస్తులమీద నీకేవిధమైన సంబంధంలేదు. ఇంతవరకు నేను నీమీద చూపిన గౌరవం గంగపాలు చేశావ్. నా మాటంటే నీకు విలువ లేకపోయింది. ఇదేనా ధర్మం? (విచారంతో) కన్నతండ్రిని - చిన్నతనంనుంచి పెంచిన

తండ్రిని. పితృవాక్య పరిపాలనకు పురాణపురుషుడ నని పించుకొంటా నన్నావ్. నా ఆశ నిరాశ చేశావ్! నీ కిది ధర్మంకాదు. అదే నీకు కావలసిందయితే నావారిని నేను తీస్తాను. (వెళ్లబోవును)

కుమా:- (కాళ్లపట్టుకొని) మన్నించండి. నా మనస్సు పద్మనుండి వేరుకావటం లేదు.

నారా:- అయితే నామాట వినదల్చుకోలేదన్నమాట.

కుమా:- వినలేకుండా వున్నాను. వింటే నమ్మించిన పద్మకి అన్యాయం చేసినవాడి నవుతాను. వినకపోతే మీ మనస్సు కష్టపెట్టి మీకు వ్యతిరేకించిన వాణ్ణవుతాను.

నారా:- (లేవతీస్తూ) పల్లెదాన్ని అన్యాయం చేయట మెట్లా అవుతుంది? అది అంత తప్పుక్రింద రాదు. లోకంలో ఎంత వుండి అవసరానికి.

కుమా:- అదిమాత్రం తప్పుకాదా? మనకోసం ఒక అమాయకురాల్ని నమ్మించి మోసంచేయటం పాపం కాదా?

నారా:- ఈ ధర్మపన్నాలన్నీ నా కనవసరం. తాత్కాలికంగా ప్రేమిస్తే తప్పుకాదు. ఆవిధంగానే పల్లెపిల్లని తాత్కాలికంగా ప్రేమించాననుకో. ఇంకెప్పుడు దాన్ని తలవకు. నా మాట వినదల్చుకోకపోతే నీ యిష్టంవచ్చినట్లు సంచరించు. నేను నీకు, నీ పల్లెపిల్ల ప్రేమకు బలైపోతాను.

కుమా:- వద్దు....నాకోసం, పద్మ ప్రేమకోసం, మీరు బలైపోవద్దు. మీ మనస్సు కష్టపెట్టాను. క్షమించండి. పల్లెపిల్ల పద్మని చేసుకొంటే మీకు, మీ గౌరవానికి భంగం కల్గు

తుందని తెలుసుకోలేకపోయాను. మీ గౌరవమే నాకు గౌరవం. మీ ఆసీస్సులే నా భవిష్యత్ జీవితానికి మెట్లు. మీ చల్లని చూపులే నాకు, నా సంసారానికి ముస్ముందు అండ. చేసిన ప్రమాణం నెరవేర్చుకోలేనందుకు పద్మ పాదాలు వుచ్చుకొని క్షమార్పణ కోరుకుంటా. మరో జన్మ కైనా తప్పక పెండ్లాడుతానని, బ్రతిమలాడుకుంటాను. మీ యిష్టప్రకారం, మీ యిష్టమొచ్చిన అమ్మాయిని పెండ్లి చేయండి.

నారా:- (సంతోషంతో) కుమార్! (కౌగలించుకొనును)

కుమా:- నాన్నా! మరో చిన్నకోర్కె!

నారా:- నిరభ్యంతరంగా చెప్పు!

కుమా:- పద్మని,....అ హ హ....ఏమీలేదు.

నారా:- కుమార్!

కుమా:- (నిలుస్తాడు)

నారా:- విచారించకు. సాటి కులస్తురాలు. నీతో కలిసిమెలిసి చదువు కున్న శోభనిచ్చి పెండ్లి చేస్తాను. రేపే మంచిరోజు చూచి లగ్నం ఏర్పాటు చేయిస్తాను.....(నిష్క్రమించును)

కుమా:- (తెల్లబోయిచూస్తూ) పద్మా! నిన్ను మోసంచేసి, నీ సౌం దర్యాన్ని అపహరించినందుకు నన్ను క్షమించు. కుల గౌరవాలకు కట్టుపడ్డ నా మనస్సు నానుండి వేరయింది.

ప్రకా:- (ప్రవేశించి) ఎప్పుడొచ్చారండి అబ్బాయిగారూ?

కుమా:- (మాట్లాడడు)

ప్రకా:- ఏమిటో ఆలోచిస్తున్నట్లున్నారు.

కుమా:- ఏమీ లేదు....మీరు ఇక్కణ్ణుంచి దయచేయండి!

ప్రకా:- శరీరం అనారోగ్యంతో బాధపడుతోందా?

కుమా:- అవును. ఇంకా బ్రతికివున్నాననే బాధపడుతోంది. చావటానికి ఏదైనా మార్గముంటే శెలవు యివ్వండి!

ప్రకా:- (చెవులు మూసుకొంటూ) హరహర. అదేమిటండి పుట్టిక్కని అంత మాటనుకున్నారు!

కుమా:- (మొహంలో విసుగుదల కనపరుస్తాడు)

ప్రకా:- ఒక్క మనవి.

కుమా:- ఏమిటి?

ప్రకా:- ఇంతకీ నాన్నగార్ని....

కుమా:- (గట్టిగా) మర్యాదగా దయచెయ్యమని చెప్తుంటే బుద్ధి లేదూ?

ప్రకా:- (విధేయకగా) లేదండి.

కుమా:- ఛీ వెధవకొంప! (చరచరా నిష్క్రమిస్తాడు)

ప్రకా:- (ఏమో అన్నట్లుగా చూస్తూ వెళ్తాడు)

(తెర)

# పల్లెపిల్ల

~~ప్రథమ~~ రంగం

(పూరిగుడిశలో కుక్కి నులకమంచంలో పడి జబ్బుతో బాధపడు తున్న నర్సయ్య మూలుగుతూంటాడు. సమీపాన కోళ్లగంప బోర్లించి వుంటుంది. గంపకింద కోళ్లు కిచకిచలాడుతూంటాయి. మరోప్రక్క మేకపిల్ల కట్టేసివుంటుంది. గుడిశకు పై భాగంలో ఎండుచేపలతోరణం వ్రేలాడుతూంటుంది, దణ్ణెంమీద పాత గొంగళి, కొన్ని చినిగిపోయిన పాత గుడ్డలూ వ్రేలాడుతూ వుంటాయి. నర్సయ్యకు ఆవేదన ఎక్కువై దగ్గుతూ వుండగా తెర నెమ్మదిగా లేస్తుంది)

నర్స:- (బాధతో) అబ్బ - బాధ - భరించలేని బాధ....బాధ .... బా....ధ....

తెరలో:- నర్సయ్యమామ జబ్బుతో మంచంలోపడి బాధపడి సత్తున్నాడు గందా, ఆడి కిన్ని నీల్లుపోసే దిక్కు నేకుండా పద్ద మ్మేడకెల్లిందో ?

నర్స:- నీళ్ల కెల్లిన పద్దమ్మ యింకా రానేదే!

తెరలో (2వ కంఠం:-) అది ఏడకెల్లిందో నీ కింకా తెలియవంట్రా? ఆ బాపనోళ్ల బుల్లోడితో సరసా లాట్టాని కెల్లిందెహే - పాపం యీ ముసలోడు ఎటుపోతే దానికేం ?

నర్స:- ఆ! సరసాలా!

1 వ కంఠం:- నిన్నోడో అంటే నాను నమ్మనేదులే; పైగా కడుపని శెప్పాడు.

2 వ కంఠం:- ఆరి పిచ్చోడా! కాదంట్రా మరి - ఆ నాయుడిగారి పూలతోటలోకెల్లి సూడు. రోజూ వాకటే పకపకలు!

సర్స:- అవత్తతో నేను బాదపడుతుంటే దీని యవ్వారం యిట్టా గుందన్నమాట - పోనీ పాసం వుండగానే వోడిసేతుల్లో నన్నా పెడదామూఅంటే దీని మూలాన వోడూ యింటి సాయల కొచ్చాడా రాంది నానేటి సేసేది?.... యింత ముదిరి పోయాక యిప్పు డేటిసేయటం? సివరకు ఏటిశేద్దామన్నా తోసటల్లేదే- అసలు దీని మతియిర్సిన ఆ ముండానాయా లెవడంట ? (ఆలోచిస్తూ) ఆయాల నీళ్లు తీసుకున్న దరిద్దుడు కామకందా - (ఆయాసంతో) ఎవడో, ఏమో - ఎన్నిసార్లడిగినా శెప్పందేనా.... యిటు పల్లెపల్లంతా ఆడి పోత్తోంది. ఏ యీదిలో చూసినా కాకినాగా గోలసేత్తుండారు. యేగుడిశలో సూసినా యిదేమాట - వోడినోటంబడి యిన్నా యిదే వూసు. నే ఎళ్తుంటే నాయాళ్లు నా యెనకాలే గోలసేత్తుండారు. (ఆయాసం యెక్కువై బాధపడుతూ) ఎందుకు గోలసెయ్యరు? ఆళ్లనంటే ఏటి ప్రయోజనం? పైగా కడుపంట! అదెంతవరకు సత్తెమో .... ఆలోసించి సూత్తే అంతా నిజమే అనిపిత్తోంది - లోకులు కూసే కారుకూతలు యినన్నా యిది బుద్ధి తెచ్చుకో అక్కర్లా ? విశారిత్తే నాబమేటి కనుపిత్తాది? రానీయ్ - యెవ్వారమంతా ఎంటనే తేలుత్తాను. వేకపోతే దీన్తో మరీ సావొత్తాది.

(పద్మ నీళ్లకుండ చంకన పెట్టుకొని కూనిరాగం తీస్తూ ప్రవేశించి, నర్సయ్య పెద్దగా ఆయాసపట్టం చూసి రాగం ఆపి, నీళ్లబిందె దింపి నర్సయ్యను సమీపిస్తుంది)

పద్మ:- ఆయాసం ఎక్కువగావుందా నాన్నా?

నర్స:- (మాట్లాడడు)

పద్మ:- మాట్లాడవేం నాన్నా! (మంచంమీద కూర్చుంటుంది)

నర:- నాన్నంట - నాన్న ! నాన్నంటే - నాసంటే భయం లేకుండా నడుస్తూ -

పద్మ:- అదేమిటి నాన్నా అట్లా అంటావ్?

నర:- నీలాంటి లచ్చనంగల కూతురుంటే అన్నా? పిల్లా! నే నడిగినదానికి సరిగా సమాధానమియ్. నీవు యింత సదువు, యింతగ్యానం ఎట్టా నేర్చుకున్నావో సెప్పు- (ఆవేశంతో లేవబోయి లేవలేకపోతాడు)

పద్మ:- చేప లమ్మకొచ్చేటప్పుడు దార్లో నేర్చుకున్నాను.

నర్స:- (కోపంతో) దార్లో నేర్చుకున్నావా, డొంకలో నేర్చుకున్నావా? నిజం సెప్పు. ఏ యెదవ మోసంచేసి నిన్ను ఆడి వల్లో ఏసుకున్నాడో నిజం సెప్పు.

పద్మ:- చదువు నేర్చుకున్నంత మాత్రాన మరొకడు వలో వేసుకోట మవుతుందా నాన్నా?

నర్స:- ఏంటీ! ఎంత తెగించిసెప్తున్నావే - యిదేనా నీ యవ్వారం? యిదేనా నామాట లచ్చపెట్టటం? లోకులుకాకులు కూడా లేమన్నా యినిపిత్తున్నాయా?

పద్మ:- లోకులమాటలు విని నామీద చేనిపోని పిచ్చి అనుమా

నాలతో ఎందుకు బాధపడతావ్ నాన్నా!

నర్స:- సూడు, నే నిట్టా బావలో మూలిగి సత్తుంటే మన గుమ్మం వోరన్నా తొక్కుతుండారా? పైగా వొకటే ఆడిపోసుకోటం - ఆ యవ్వ లట్టా ఆడిపోసుకుంటుంటే, నే బతికి బయటకెల్లా ఎల్తాను సెప్పు.

పద్మ:- మన మంటే గిట్టనివా ళ్లెవరో ఆడిపోసుకుంటారు కాని,....

నర్స:- ఆళ్లెవరే? యిదివర కెన్నడూ నేంది యిప్పు డేడనుం డొచ్చారు? పద్దమ్మా నిజం చెప్తున్నాను. యీ యవ్వారం యిల్లాగే సాగిందంటే, యీ గూడెంలో మనం వుంటాని క్కూడా యీలుండదు. (విచారంగా) నా మాట యిని నిజం సెప్పు - యిప్పటికైనా నిజంసెప్తే అయిన తప్పుకి మన్నించమని మన పెద్దోళ్ల కాళ్లు పుచ్చుకుందాం.

పద్మ;- నే నే పాపం ఎరగను. ఎవరిలోనన్నా కాస్తమార్పు సంభవిస్తే చాలు యీ పాపిష్టి లోకంలో అనేకరకాల అపోహాలు అవతరిస్తాయ్.

నర్స:- (దగ్గరకు తీసికొని బుజ్జగిస్తూ) సెప్పుతల్లీ ! నిన్నే మీ అన్న. వొకేల శేశావే అనుకో, తెలియక ఎంతమంది సేయటల్లేదు. నిజం సెప్తే యికముందన్నా జాగత్త పడతాం. నిజం సెప్పకపోతే యీ దిగులే నాకు పెద్దదై సివరకు సావుకూడా తెత్తుంది....సిన్నప్పటినుంచి నిన్నెంత గారాబంగా సూసుకుంటున్నానో నీకు తెలియన్దా! (దగ్గుతో ఆయాసం ఎక్కువై హీనస్వరంతో) యిప్పుడు నీవు శెప్పకపోతే నీమూలాన నా బాద మరింత ఎక్కువవు

తుంది....నా మాట యిని నిజం సెప్పమ్మా!

పద్మ:- (మాట్లాడదు)

నర్స:- (బుజ్జగిస్తూ) సెప్పమ్మా సెప్పు-

పద్మ:- (మాట్లాడదు)

నర్స:- శెప్పవూ ? నే నిట్టా దిగులుపడి సావాల్సిందేనా? పద్మమ్మా! నువ్వు నిజం సెప్తే, నీకు పెళ్లమేనారాసన్నా బతుకుతానసే ఆశుంది. నేకపోతే....

పద్మ:- వద్దు నాన్నా వద్దు - తప్పు చేశాను. నీకు కలవంకవు తెచ్చాను. పల్లె పెద్దగా సంచరిస్తున్న నీ హృదయంలో నామూలాన తీరని అగ్నిజ్వాలలు అంకురించినై - యిప్పటి నీ పరిస్థితికి పూర్తిగా నేనే కారకురాలనని విశ్వ శిస్తున్నాను. నన్ను క్షమించు నాన్నా !

నర్స:- (ఆవేశంతో లేవాలని ప్రయత్నిస్తూ) ఆ! ఎవడు? ఎవ డా యదవ నిన్ను మోసంసేసింది? శెప్పు, యిప్పుడే ఆ నాయాల్ని ముక్కలు ముక్కలు సేత్తాను. సెప్పు - ఊఁ-

పద్మ:- ఆయన నిర్దోషి - ఆయన్ని నిందించకు నాన్నా - నా గౌరవం మంటకలిపింది యీ నిర్భాగ్యురాలే - మీకు తెలియకుండా, మీతో చెప్పకుండా వారి ప్రేమకు నా హృద యాంజలిని కానుకగా యిచ్చాను. పెండ్లి చేసుకుంటానికి సమ్మతించాను.

నర్స:- ఏంటీ! పెద్దోణ్ణి నే బతికుండగానే నీ యిట్టసన్నమాట ? అంతేనా?

పద్మ:- మన్నించు నాన్నా!

నర్స:- యిప్పుడేటి శేయటం....(ఆలోచించి) పోనీ యికనుంచన్నా ఆ వూసెత్తనని పమాణంసెయ్. ఊ -

పద్మ:- చేయలేను. ప్రమాణం చేయలేను. మనస్సిచ్చి మనస్సు పుచ్చుకున్నాను. విద్యనేర్పి, వృద్ధిలోకి తీసుకొచ్చి వారి అమృత హస్తాలతో మసిబొగ్గును మాణిక్యంగా మార్చారు. చేసిన మేలు మరువరానిది. నన్ను నమ్మి నన్నే వారి హృదయ సామ్రాజ్యానికి మహారాణినిగా చేయటానికి ఎదురు చూస్తున్నారు. ఆ ప్రేమమూర్తిని మోసంచేసి, వారికి ప్రమాణంచేసి, చేసిన ప్రమాణం మర్చిపోయి నీకు ప్రమాణం చేయలేను నాన్నా!

నర్స:- సెయ్యవూ ? నేనిట్టా దిగులుతో సావాల్సిందేనా? (బ్రతిమిలాడుతూ) నామాట యినుతల్లీ ! మన కులపోణ్ణి సూసి పెల్లిసేసుకోటం మనకి గౌరవం. నాసుకూడా పోతే నిన్ని పపంచకంలో ఆదరించేవాళ్లే వుండరమ్మా. నీమంచి కోసం సెపుతున్నాను. నా మాట యిని యికముందు ఆ వూసెత్తనని పమానం చెయ్ తల్లీ—

పద్మ:- నిర్బందించకండి. కన్నకూతురు కోర్కె చెల్లించలేని తండ్రి హృదయం పాషాణంతో సమానం. నన్ను నిర్బంధించకండి. (నర్సయ్యమీద పడుతుంది)

నర్స:- ఆ! ఏంటీ - నామాట యినవ్!

పద్మ:- క్షమించు నాన్నా!

నర్స:- నా నేటిసేయను?....గర్భంలో గుడ్డు దిన దినానికి పెరిగి పోతోంది. కులం సెడినదాన్ని సూత్తూ సూత్తూ నోకం

ఎట్టా వూరుకుంటాది? దాన్ని ఓసుపెళ్లాడుతాడు. (పద్మతో) పద్దమ్మా - లోకులు సెప్పుకునేమాటలు సత్తెమేనా?

పద్మ:- ఆ.

నర్స:- నర్సయమామ తొందర్లోనే మనవణ్ణి సూత్తా వంటున్నారే ....అది.

పద్మ:- నిజమే నాన్నా!

నర్స:- (బుజాలు పట్టుకొని) నిజమే! ఎంతపని జరిగిందే ముండా! గౌర్తగా బతుకుతూ నలుగుర్లోను అపు ననిపించుకుంటున్న నా కళ్లు కప్పి, నాకు తలవంపులు తెచ్చావుకదే - యింత పని సేత్తావని నా నెప్పుడూ అనుకోలేదు కదే పాపిష్టి ముండా! (క్రిందకు తోసి) ఛీ - నీ మొహం సూత్తేనే పాత కం సుట్టుకుంటాది....పో—పో—యీడనుంచి పోయి ఏడన్నా పడిసావు- పో—

పద్మ:- నాన్నా-

నర్స:- (వినిపించుకోకుండానే) మీ అమ్మ బతికిన నాలుగురో జులూ ఎంత నీతిగా బ్రతికిం దనుకున్నావ్? దానికడుపున శెడపుట్టావ్ కదే - నా గౌర్తకి సిచ్చుపెట్టావ్-ని న్నేటి సేసినా పాపంనేదు .సూడు ని న్నేటిసేత్తానో - (పద్మని చెయ్యెత్తి కొట్టబోయి క్రిందకు దొర్లి) అమ్మ - బాధ.... బా....ధ....(మరణిస్తాడు)

పద్మ:- (నర్సయ్య మీదపడి ఏడుస్తూ) నాన్నా! నన్ని లోకంలో ఏకాకిని చేసిపోయావా! నీవు యీలోకాన్ని వీడినా నీ ప్రేమాభిమానాలను మరువలేను. చిన్నతనంలోనే తల్లి

కరువైనా. ఆ స్థానాన్ని నువ్వాక్రమించుకొని నన్ను పెంచి పెద్దదాన్నిచేశావ్ - నా మీదే ఎన్నో ఆశలు పెట్టుకు జీవించావ్ - యీ నిర్భాగ్యురాలి మూలాన్నే నీ ఆశలు స్వప్న సౌధాల్లాగా కూలిపోయాయ్-ఆ దిగులు తోనే నన్ను వంట్రిదాన్ని చేసి యీలోకంలో లేక పోయావ్ - నాకింక లోకంలో దిక్కెవరు? పవిత్రప్రేమకు స్థానం వుందని, కుమార్ ప్రేమకు నా జీవితాన్ని అంకి తం చేసి, అదే నా జీవితాశయమనుకొని, సంఘంలో వస్తున్న దుష్టను బహిరంగపర్చాలనే ఆశతో, నీ మనస్సు కష్టపెట్టి, చివరకు నీ ప్రాణాలు సైతం బలితీసుకొన్న పరమ పౌర్భాగ్యురాల్ని క్షమించు నాన్నా! కాని, నీ ఆద రాన్ని మాత్రం జన్మ జన్మలకీ మరువలేను. (నెమ్మదిగా లేచి సర్పయ్య శవానికి గుడ్డ ముసుగేస్తుంది)

కుమార్:- (నెమ్మదిగా ప్రవేశించి సర్పయ్య శవాన్ని చూసి సిలావిగ్రహంలాగ నిల్చుండిపోతాడు)

పద్మ:- వచ్చారా! (విచారంగా) హృదయంలేని యీ సమాజంలో జీవించలేక మానాన్న చీకటి తెరల్ని చీల్చుకుంటూ యీ లోకాన్నే విడిచిపోయాడు. నన్నీవిశాల ప్రపంచంలో వంట్రిదాన్ని చేశాడు.

కుమా:- (మాట్లాడడు)

పద్మ:- అట్లావున్నారేం?

కుమా:- ఏమీ లేదు.

పద్మ:- మరెందు కట్లావున్నారు?

కుమా:- మన కథ అడ్డం తిరిగింది.

పద్మ:- అంటే?

కుమా:- మన వూహలు పటాపంచలయ్యాయ్. మన ఆశాసౌధాలు అగాధ పతనాలైనాయ్.

పద్మ:- మీ మాటలు నాకు అర్ధం కావటంలేదు.

కుమా:- నీ జీవిత కుసుమాన్ని ఆఘ్రాణించి, నీ యవ్వన మధువును మైమర్చి ఆస్వాదించాను. వివాహమాడతానని నీవు విశ్వసించేటట్లు ప్రవర్తించి, ప్రమాణంచేసి. చివరకు మాట నిలుపుకోలేకపోయాను.

పద్మ:- మీ మాటలు చాలా వింతగా వున్నాయే!

కుమా:- వింతలేదు విచిత్రమూలేదు. ఆనాడు నిన్ను నా హృదయ సామ్రాజ్యానికి మహారాణినిగా చేసుకున్నాను. మనస్సుకు మనస్సు జతపర్చి యీ నాడు నా భౌతికశరీరాన్ని పరాధీనం చేశాను.

పద్మ:- ఆ!

కుమా:- నాన్నగారి బలపంతంమీద శోభని వివాహమాడటానికి అంగీకరించాను. .

పద్మ:- అంగీకరించారా?

కుమా:- అవును. అంతకంటే చేశేదిలేదు. సంఘానికి, మా నాన్న ఆత్మగౌరవానికి మన ప్రేమను బలిచ్చాను.

పద్మ:- యిచ్చారా! మీ కిది ధర్మమా? పల్లెపిల్ల కదా అని మోసం చేసి, తీయని మాటల్తో లోబర్చుకొని నా జీవితాన్ని మలినం చేసి, పాప పంకిలంలోకి యీడ్చి యిప్పు డీ విధంగా

మాట్లాటం మర్యాదేనా?

కుమా:- కాదు. అయినప్పటికీ నావల్ల నా తండ్రికి కష్టే తలవంపు లకు సహించలేక ఆయన మాటలకు ఎదురు చెప్పలేక వారి ఆత్మగౌరవానికి మన ప్రేమను కానుకగా యిచ్చాను.

పద్మ:- తండ్రిమాటకు అంత అడుగుదాటనివారు అన్నీ ముందే తెల్సుకు ప్రవర్తించకపోయారా?

కుమా:- ఆ విధంగా ప్రవర్తించాను కనుకే క్షమాపణ కోరుకుం టున్నాను.

పద్మ:- యిదేనా మీ ధర్మం?

కుమా:- యింకకంటే ఏం చేయను? నేను చేసిన అన్యాయానికి నీవు కోరినంత డబ్బిస్తాను. మీ కులంవాణ్ణి చూసి పెండ్లి చేసుకో.

పద్మ:- డబ్బు ! పెండ్లి !! యిదేనా మీ ఆదరణ? ఆడదంటే మీ రాడింపినట్లల్లా ఆడే ఆటవస్తువనుకున్నారా? మాకూ, మా కులానికి గౌరవముంది. నేను కోరేది మిమ్మల్ని కాని, తుచ్ఛమైన మీ డబ్బునుకాదు. పల్లెవాళ్లంటే పరువు ప్రతిష్టలులేని పశువులనుకున్నారా? మీ మూలాన్నే నా తండ్రి మనస్సు కష్టపెట్టి ఆయన్ని భూదేవికి అర్పితం చేశాను. నాకు మీ రొక్కరే దిక్కని ఆశపడుతున్నాను.

మీరుకూడా నా ఆశ నిరాశచేస్తారా? కులం, సంఘం, అంటూ మన స్వేచ్ఛాజీవితాన్ని తునకలు చేస్తారా? ఆడిన మాట తప్పనివారైతే నన్ను మీదాన్నిగా చేసుకోండి. లేకపోతే....

కుమా:- (పెద్దగా) పద్మా! నిష్ప్రయోజనమైన మాటల్తో పనిలేదు. నే నీ విషయంలో అస్వతంత్రుణ్ణి. నాకు తండ్రిమీద వుండే ప్రేమ, గౌరవాలు వకరు చెప్తే నశించేవికావు. మా నాన్న కోసం, ఆయన క్షేమంకోసం నా జీవితం నాశనమైనా సంతోషమే! ఆయనమాట కాదని నే నేమీ చేయలేను, చేయను. చేయటానికి అసమర్థుణ్ణికూడా!

పద్మ:- (నెమ్మదిగా) అయితే నా జీవిత మింతేనా?

కుమా:- కాదు. సాటికులస్థుణ్ణి పెండ్లాడి సుఖపడు. యింతకంటే నే నేమీ చెప్పను.

పద్మ:- నన్ను అన్యాయం చేయొద్దు - (పాదాలు పుచ్చుకొని) యీ దీనురాలు మీ ప్రేమను మర్చిపోలేదు. ఎప్పుడూ మీ అడుగునీడల్ని సేవించి పూజిస్తూనే వుంటుంది. చెప్పుడుమాటలు విని మన పవిత్రప్రేమను బూడిదలో పోసిన పన్నీరు మాదిరి ధ్వంసం చేయకండి. మనం పెండ్లి చేసుకుందాం. సంఘం, కులం మన్నేమీ చేయ లేవు. పవిత్రప్రేమకు కులవిచక్షణతో పనిలేదని ప్రపంచంలో తిరుగుబాటు చేద్దాం.

కుమా:- (రెండడుగులు వెనక్కు వేసి) నా మనస్సు పాడై పోయింది. నిన్ను పెండ్లిచేసుకోటం అనేది అసాధ్యమైన పని. అపని చేయలేను. (చరచరా వెళ్తాడు)

పద్మ:- (విచారంతో ఆవేశంగా) వెళ్లిపోయారా! వెళ్లిపోయారా! (లేచి) యిదేనా ధర్మం? యిదేనా న్యాయం? ఒక పేద పల్లె పిల్లని మోసంచేసి, హృదయాన్ని అపహరించి

అన్యాయంగా పదిమంది నోళ్లల్లో పడెయ్యటంన్యాయమా? యిటు కులంలోనుంచి బహిష్కరించబడ్డాను .. అవును. బహిష్కరించాల్సిందే - (తండ్రిని చూసి విచారంగా) నాన్నా! పెద్దవాడవైన నీ మాట తిరస్కరించినందుకు నిజంగా బహిష్కరించాల్సిందే. కులాచారం, మతం అంటూ ఎంతమంది ప్రేమజీవులకు ఎడబాటు కలుగ జేస్తారు?....నేను ఏకాకిని. నా కీ ప్రపంచంలో దిక్కెవరు? సంఘంలో న్యాయానికి స్థానం లేదు. ప్రేమకు విలువ లేదు. ఛీ - పాడుసంఘం!

(నెమ్మదిగా తెర జారుతుంది)

(జనం రోడ్డుమీద అటూ యిటూ తిరుగుతూ వుంటారు. తెరలో పాట)

ఇంతే నన్నా - జీవిత మింతే నన్నా ....॥జీవి॥
తోడులేక - నీడలేక
కడుపునిండా - తిండిలేక
బ్రతుకుకోసం - బాధపడెడి
ప్రేమజీవుల - ప్రేమజీవిత, మింతే నన్నా ....॥జీవి॥
కడుపులోనా - గృడ్డు పెరుగుచు
కన్నతండ్రిని - కోలుపోయి
పతినిబాసి - దిక్కులేక
బాధనొందుచు - బ్రతుకుజీవుల
గ తింతేనన్నా.... ॥జీవి॥

పద్మ:- (బిచ్చ మెత్తుకుంటూ పాడుకుంటూ ప్రవేశం - చంకని జోలి. అందులో పసిపిల్లా డుంటాడు)

పాట

దయలేదా - నాపై - దయలేదా ॥దయ॥
నాజీవితమె - అగాధము - అంధకారమే యీ ప్రపంచం
పేదజీవులపైన - లేదా - కరుణ
కనికరమింతైనా - లేదా - ॥దయ॥
ఆకలిబాధతో - మలమల మాడుచు
క్రమ్గిపోయె - పేదల ఆకలి
బాధను తీర్చగ - లేదా - ॥దయ॥

అమ్మా! గుప్పెడు బియ్యం వెయ్యితల్లీ (అడుక్కుంటూవుంటుంది)

పతినిబాసి - దిక్కులేక
అమ్మాయనుచును - వేడుకొనంగ
దయలేని యీ మొండి జీవితముపై
కనికరమింతైనా లేదా.... ॥దయ॥

పేదవాళ్లంటే జాలిలేని కఠినులదే యీ లోకం. పేద వాడి మాట పెడచెవిని పెట్టి పుష్టిగా తిని, కన్నుమిన్ను గానక ప్రవర్తించే పరమ దుష్టాగ్రేసర చక్రవర్తులకే అగ్ర తాంబూలమిచ్చి సుస్వాగతా లిస్తుంది యీ లోకం. వాళ్లే యీ లోకంలో ఆరాధ్య దేవతలు! పేదవాళ్లంటే ఎందుకూ కొరగాని చిల్లపెంకులకన్నా కనాకష్టం. భగవంతుడా! చివరకు నేను నీక్కూడా పనికిరాకపోయానా? రెండు రోజులనుంచి తిండిలేక ఆకలి బాధతో మలమలా మాడిపోతున్నానే - నాపైన నీవైనా కనికరించలేవా?

జగతి ధర్మము శూన్యమై చచ్చెనొక్కొ
లేక నా కర్మఫలమొకొ - ఈకరణిని

ఆకలి దహింప కరుణ - అమ్మా యటన్న
పలుకువారలు లేక చావంగనుంట ॥

(బ. అప్పారావుగారి గీతం)

అమ్మా ! ఆకలి దహించివేస్తోంది తల్లీ ! పిడికెడు బిచ్చమమ్మా.

తెరలో:- పిచ్చిదానా ! ఎందు కల్లా బాధపడతావ్ ? ప్రేమించి నీ జీవితం నాశనం చేసినవాడు నీ జానెడు పొట్ట నింప లేడా? వెళ్లు, నీ భర్త నిన్ను నిరాకరించినా తప్పులేదు, వెళ్లు. ఆ పంచ యీ పంచ పట్టుకొని అలమటిస్తూ యీ ఆకటి బాధకు ఎందుకు ఆహుతైపోతావ్ ? ఊఁ వెళ్లు.

పద్మ:- నిరాకరించారే!

తెరలో:- అయినా నీ వెళ్లి నీ భర్తని ప్రాధేయపడి అడగటంలో తప్పులేదు.

పద్మ:- అనుగ్రహిస్తారా?

తెరలో:- ఆగ్రహించినా విడిచిపెట్టొద్దు. పాదాలు పుచ్చుకో - పో-

పద్మ:- వెడతాను - యిప్పుడే వెడతాను - శ్రమపడైనా వా రెక్కడుందీ తెలుసుకుంటాను. (నిష్క్రమిస్తుంది) ✗

(మధుసూధనపంత్ సిగరెట్ పీలుస్తూ ప్రవేశం)

పద్మ:- (ప్రవేశించి) ఏమండి, పదిరోజుల్నుంచీ తిండిలేక మాడి పోతున్నాను. ఆకలిబాధ నా యెముకల్ని కొరికేస్తోంది. ఒక్క కానీ వుంటే ధర్మంచేయండి బాబూ!

మధు:- (పద్మనిచూస్తూ) యిదీ వొక వ్యాపారమే - యెక్కడెక్కడ లేనివాళ్లూ మద్రాస్ రావటం - అడుక్కోటం - బేష్ బాగుంది! చాలు చాలు గానీ వెళ్లు. దున్నపోతులా

గున్నావ్. అంట్లుతోముకు బ్రతకరాదూ?

పద్మ:- (నిరుత్సాహంతో నెమ్మదిగా నడుస్తూ వుంటుంది)

మధు:- (ఆలోచిస్తూ) పిల్లచూస్తే బలే పసందుగావుందే! మన వశం అవుతుందేమో. ప్రయత్నించినా బాగుండేది. అయినా ట్రైల్సు వేస్తే సరి - (పద్మని) ఏయ్, పిల్లా !

పద్మ:- (నిలుస్తుంది)

మధు:- (సమీపించి) యిందాక నిన్ను చూసి ఏమిటో అనుకున్నాను. చూడు - యిట్లా అడుక్కు-తింటే మాత్రం ఏం గౌరవ ముంది? నామాట యిని మాయింటికిరా. నీ దరిద్రం తీరి పోతుంది. నేనా వంట్రివాణ్ణి. మనకి మారేజి, గీరేజీ ఏమీ లేవు. ఏదో నీకు నేనూ, నాకు నువ్వూ తోడుగా వుందాం. నీ క్కా-వలసిన వన్నీ నువు కోరటం తడవుగా బ్యూటిఫుల్‌గా తీసుకొస్తాను....ఏమంటావ్?

పద్మ:- (కోపంగా మధుని క్రిందనుంచి పైదాకా చూసి చరచరా వెళ్లబోవ)

మధు:- ఇదిగో! నామాట విను. (చేయి పట్టుకుంటాడు)
(పద్మ కోపంతో చెయి విదుల్చుకుని మధుని చెంపమీద కొట్టి వెళ్లిపోతుంది)

మధు:- (చెంప సవిరించుకుంటూ) యింకా నయం. ఎవరూ చూల్లేదు కాబట్టి సరిపోయింది. లేకపోతేనా ముష్టి పిల్లలతో సహా మనకు లెంపకాయలు ప్రజంటేషన్స్ యిస్తున్నారని పంతులుగారి పరువు అమాంతంగా బజార్లో పడేది,
(నెమ్మదిగా నిష్క్రమిస్తాడు)

# పల్లెపిల్ల

## ఆరోరంగం

(స్థలం: కుమార్ ఆఫీసు గది. పుస్తకాలు చిందర వందరగా పడేసి వుంటాయి. కుమార్ చికాగ్గా సిగరెట్ మీద సిగరెట్ కాలుస్తూ అటూ యిటూ తిరుగుతూంటాడు. లైటింగు అతని ముఖంమీద ఫోకస్ చేస్తూ వుండాలి. తెరవెనుక ఒక ప్రక్కనుంచి పద్మ మాటలు, మరో ప్రక్క నుండి కుమార్ అంతరాత్మ మాటలు వినిపిస్తూంటాయి. తెర నెమ్మదిగా ఎత్తబడును.)

పద్మ:- వద్దు దొరా వద్దు. మీరు పెద్ద మారాజులు. నన్ను పెళ్ళి నేసుకుంటే మీ అయ్యోరుకుంటాడా? మా అయ్య నన్ను బతకనిత్తాడా? పెద్దకులపోళ్ళు మోసం శేత్తారని మా అయ్య సెప్పాడు, వద్దు.

అంత:- మోసం చేయను - నిన్ను పెళ్లి చేసుకుంటాను, నా మాట విను పద్మా!

కుమా:- మోసం! నేను చేసింది మోసమా?

అంత:- అవును. నిజంగా మోసమే చేశావ్. పల్లెపిల్ల పద్మకి తీరని ద్రోహం చేశావ్! మనస్పిచ్చి అమాయకురాలైన ఆమె హృదయంలో తుఫాన్ లయలు దేరతీశావ్. అటు కులంవారిలో నీచపుబ్రతుకు కనిపించుకుంది. యిటు నీచేత

తిరస్కరించబడింది. నీ మనస్సు అతి చులకనైంది. అక్కడ పద్మని ప్రేమించి, యిక్కడ శోభని పెండ్లి చేసుకొని హాయిగా శోభతో కులుకుతూ కూర్చుంటే పద్మ గతి ఏం కావాలనుకున్నావ్? నీచుడా! ఈ విధంగా ఎంతమంది జీవితాలను నీ కామానికి కానుకగా తీసుకుంటావ్?

కుమా:- నేనా!

పద్మ:- చెప్పుడు మాటలు విని మన పవిత్ర ప్రేమను బూడిదలో పోసిన పన్నీరు మాదిరిగా పాడుచేయకండి.

కుమా:- ఆఁ! పాడుచేశానా!....నేనా....

అంత:- నువ్వే! పల్లెపిల్ల కదా అని అన్యాయం చేసి, ఆమె శీలాన్నపహరించి డబ్బిస్తానని ఆశపెట్టావ్. ఎందుకు నీ డబ్బు? తండ్రి మాటకు అంత అడుగుదాటనివాడవు పరువు ప్రతిష్ఠలులేని పశువులాగా ఎందుకు ప్రవర్తించావ్? నువ్వు చేసిన ద్రోహానికి పద్మ హృదయం ఎంతగా పరితపిస్తోందో చూశావా?

పద్మ:- నన్ను అన్యాయం చేయకండి. నా కీ లోకంలో మీరే దిక్కనే భ్రమతో మీకోసం ఎదురు చూస్తున్నాను........ ఏమండీ....రారూ?

కుమా:- రమ్మంటున్నావా? రానా?

అంత:- వెళ్లు. చేసిన తప్పు క్షమించమని పద్మ పాదాలు పుచ్చుకో, బ్రతిమిలాడుకో. లేదా యిటు చేసుకున్నదానికీ, అటు ప్రేమించినవానికీ అన్యాయం చేయక, యిద్దరితోనూ కులాసాగా కాలం వెళ్ళబుచ్చు.

కుమా:- చేయలేను. ఆ పని చేయలేను.

అంత:- చేయలేకపోయినా పద్మ నీ యిల్లాలే! నిర్మల ప్రేమకు చాపంటూవుండదు పద్మ ప్రేమ నిష్కలంకమైంది. వెళ్లు. ఊం. సనాతనసమాజంలో నాందిప్రస్తావన చెయ్. పిచ్చివాడా పవిత్ర ప్రేమకు కులవిచక్షణతో పనిలేదని ఢంకా బజాయించి గర్జించు. వెళ్లు - ఊ -

కుమా:- మరి - నా....న్న....మా....ట....?

(తెరలో వెషపు నవ్వులు విపరీతంగా వినిపిస్తాయ్)

అంత:- పితృభక్తి - ఏం పితృభక్తి - ఏం వినయం? పితృభక్తి అనే భ్రమతో ప్రేమించి, ప్రాణానికి ప్రాణమిచ్చి మెలగే పల్లెపిల్లని ద్రోహంచేస్తావా? పశ్చాత్తాపంతో నీ హృదయం భగభగా మండి మసైపోతేనేగాని నిజం తెల్సుకోలేవు.

పద్మ:- నా మాట వినండి - మన పవిత్రప్రేమ ఆరని అమర జ్యోతిగా ప్రకాశిస్తుంది, వినండి.

కుమా:- వద్దు - విన్లేను - వినను.

పద్మ:- (ఈర్ష్యగా) విన్లేరు, వినరు! హుం - వినవలసిన అవసరం మీ కెందు కుంటుంది? ఆడదాన్ని అన్యాయం చేసి లోకులు కూసే కారుకూతలకి తల వంగిపోయేట్లు చేశారు. నా శీలాన్ని అపహరించి నన్ను తిరస్కరించారు. మీరు చేసిన అన్యాయానికి నా హృదయం ఎంతగా క్షోభిస్తోందో ఒక్కసారి చూడండి. మీ పాదాలు పూజించి తరించే భాగ్యం నాకు కల్గచేయరూ?

అంత:- ఛీ నీచుడా! చూడు, ఆ పేద పల్లెపిల్ల నీ ప్రేమకోసం,

నీకోసం ఎంతగా విలపిస్తోందో! ఏ విధంగా కృంగి, కృశించి, నీరసించి, అస్థిపంజరంగా మారిపోయిందో! మిసమిసలాడి పొంగిపోయే ఆమె యవ్వనాన్ని పొట్టన పెట్టుకున్నావ్. ఆమె జీవితాన్ని అంధకారం చేశావ్. నీది పాషాణహృదయం. పల్లెపిల్లమీద నువు చూపిన ప్రేమ కపటమైనది. నీలో మానవత్వం నశించింది. నీవింక మానవుడుగా జీవించేకన్నా పశువుగా జీవిస్తే మంచిది. లేదా....యిప్పటికైనా నిజం తెల్సుకొని పద్మని బ్రతిమిలాడి తెచ్చుకో....ఊ....

కుమా:- పద్మని బ్రతిమిలాడి తెచ్చుకోనా?

అంత:- అవును, వెంటనే వెళ్లు - అదే నీ కర్తవ్యం.

కుమా:- వద్దు - ఆపని యిప్పట్లో జరగదు. నా జీవితం నాశనమైనా సరే, నాది పాషాణహృదయమని తిట్టినాసరె. తండ్రి మాటకు జవదాటను. పద్మకి అన్యాయంచేసినమాట నిజమే! కాని యీ నిర్భాగ్యుడు ఏమీ చేయలేని అస్వతంత్రుడు. నావల్ల కానిపని నెరవేర్చటం కష్టసాధ్యం.
(అంటూ విసుగ్గా కర్తవ్యశూన్యుడై అక్కడున్న వాలు కుర్చీలో పడిపోతాడు. శోభ కీర్తన పాడుకుంటూ ప్రవేశించి, కుమార్ని కవ్వించి అతన్ని విసుగుదలనుండి విముక్తుని చేయాలని ప్రయత్నిస్తుంది)

పాట - మధురగీతి

వినవోయి - వినవోయి
సుందరమగు ప్రకృతి గాంచుచు

కుహూ కుహూ కుహూ మని - కోయిల పాడ
ఆలపించవోయి - నా కమ్మని గొంతుతో
వలచి పిలుతు నోయి - ॥విన॥
తీయని పాటలు పాడుదు
మీ హృదయవీణ మీటుదు
జగమునె మరిపింతునోయి ॥విన॥

కుమా:- (పెద్దగా) శోభా!
శోభ:- (పాట ఆపుచేసి) హెడేగ్గా వుందా?
కుమా:- (మాట్లాడడు)
శోభ:- వినిపించటల్లేదా, వినిపించికూడా మాట్లాడదల్చుకోలేదా?
కుమా:- విసిగించకు, మనస్సు బాగుళ్లేదు.
శోభ:- పాపం! అంత కష్ట మేమొచ్చింది?
కుమా:- వచ్చింది.
శోభ:- ఎందుకు రావాలి?
కుమా:- ఎందుకు రాకూడదు?
శోభ:- వస్తే నాతో చెప్పొచ్చుగా?
కుమా:- (తల పట్టుకొని నొసలు చిట్లిస్తాడు)
శోభ:- నోవైన్ తెప్పించమంటారా?
కుమా:- (ఒక్కసారి శోభవంక విసుగ్గాచూసి తల వంచుకుంటాడు.
శోభ:- బోయ్! నా రూమ్‌లో టేబుల్‌మీద నోవైన్ ట్యూబుంది.) తెచ్చి అయ్యగారి తల మర్దన చెయ్.
కుమా:- థాంక్సు (Thanks) అంత కష్ట మఖ్ఖర్లేదు.
శోభ:- వద్దుళ్లేరా.... (సమీపించి) ఏమండీ, అట్లావున్నారేం?

కుమా:- మనస్సు బాగుళ్లేదని చెప్పాను.
శో :- నేను దగ్గరున్నాననా - లేక....
కుమా:- విసిగించక వెళ్లు.
శోభ:- నేను మాట్లాడితే మీ కంత విసుగ్గా వుందా?
కుమా:- (పెద్దగా) ముం దిక్కణ్ణుంచి వెళ్లు.
శోభ:- (రెండడుగులు ముందుకొచ్చి) బాగానే వుంది. పెళ్లయ్యేదాకా వకతీరు- అయిన తర్వాత మరొకతీరు. యీ మధ్య ఏమిటో అదో మాదిరిగా వున్నాడు. అతని ముఖ భావాలు అసలే అర్ధం కావటల్లేదు. ఎప్పుడు దగ్గరకెళ్లినా చీదరించుకొని, నొసళ్లు చిట్లించి తల గట్టిగా పట్టుకుంటాడు. నేను దగ్గరకు పోయే సరికి తలనొప్పి ఎక్కువవుతుందేమో....మారేజ్ కాకపూర్వం ఏ విసుగూ వుండేది కాదు. మనస్సిచ్చి ఎంతో కులాసాగా మాట్లాడేవాడు. అప్పుడే యింత మార్పెందుకు వచ్చిందో తెల్సుకోవాలి. ఎంత కాలం దాస్తాడో చూస్తాను.
మధు:- (ప్రవేశించి) గుడీవినింగ్ శోభా!
శోభ:- గుడీవినింగ్.
మధు:- బ్యూటిఫుల్ - వెరీ వెరీ బ్యూటిఫుల్! (కుమార్ని చూస్తూ) సారీ, సారీ, పాపం ప్లీడరుగారు అట్లా వున్నారేం?
కుమా:- తల కొంచెం నొప్పిగావుంది.
మధు:- ఇంతేకదా! పూర్తి నొప్పి ప్రవేశించేదాకా పరవాలేదులే.... ఆ! మర్చిపోయాను, కోర్టుకు పోలేదేం?
కుమా:- చెప్పేదంతా ఏమిటి?
మధు:- అందుకే నంటావా! అయితే సరేలే. ఆ! చూడు....

కుమా:- ఏమిటి చూసేది?
మధు:- అది కాదోయ్.
కుమా:- అదీ లేదు, యిదీ లేదు, గెటవుట్.
మధు:- సరిగా చెప్పనియ్.
కుమా:- (పెద్దగా) ప్లీజ్ గెటవుట్.
మధు:- (వెకిలిగా నవ్వి) దానికేంలే, కాని,....
కుమా:- (పెద్దగా) బోయ్!
తెరలో:- సార్!
మధు:- ఆ! ఏమీ లేదు. కొద్దిగా ప్రష్‌వాటరు పట్టుకురా! (కుమార్‌ని సమీపించి) అయితే మిష్టర్! నీ తలనొప్పి నిజం తల నొప్పా లేక మనస్సు బాగుండని తలనొప్పా?
కుమా:- మర్యాదగా వెళ్లమంటుంటె బుద్ధి లేదూ? (లెంప మీద కొడ్తాడు)
మధు:- (లెంప సవిరించుకుంటూ) బ్యూటిఫుల్! టూ బ్యూటిఫుల్!! నీ మర్యాదకు నా హార్టీ కంగ్రాచ్‌లేషన్స్....(శోభనిచూస్తూ) శోభాదేవీ!
బాట్‌మెంటన్ కొస్తావా?
శోభ:- వస్తాను. (కుమార్‌తో) నేను బాట్‌మెంటన్‌కు పోతున్నాను.
మధు:- (శోభతో నెమ్మదిగా) సినిమా, సినిమా....
శోభ:- వీలుగా వుంటే సినిమాక్కూడా వెళ్లొస్తాను. నేను వచ్చే లోపుగా ఆకలయితే వంట మనిషిచేత పెట్టించుక తినండి. నాకోసం మీ రేమీ కనిపెట్టుక్కూర్చో నక్కర్లేదు. (మధుతో) పదవోయ్ మధూ! పద.

మధు:- రడీ.

శోభ:- అయితే వోపని చెయ్యి.

మధు:- వాట్?

శోభ:- ను వ్వెళ్లి కార్లో కూర్చో; నేను టాయిలెట్ చేసుకొస్తాను.

మధు:- తొందరగా వస్తావు కాదూ?

శోభ:- పదినిముషాల్లో వస్తాను.

(చెరొక వైపుకూ వెళ్తారు)

కుమా:- బాగుంది - సినిమాలు, బాట్ మెంటన్లు ఎక్కువైనాయ్. లజ్జ, మానాభిమానాలూ లేని ఆడదాన్ని పెండ్లి చేసుకున్నంత బుద్ధి పొరపాటు మరొకటి లేదు. ఛీ!....

(సిగరెట్ ముట్టించి అగ్గిపుల్ల ఆర్పుతూ వుంటాడు. చెదరిన జుట్టు, మాసిన గుడ్డలు, చంకజోలిలో పిల్లాడితో పద్మ ప్రవేశం)

కుమా:- (సిగరెట్ పొగ వదుల్తూ) ఎవరు?

పద్మ:- నేనే - పద్మని.

కుమా:- పద్మ!....ఎందు కొచ్చావు?

పద్మ:- ఎందు కొచ్చానా? ప్రేమించిన మీకు దూరమై, అటు అల్లారు ముద్దుగా పెంచి పెద్దచేసిన తండ్రికోర్కెలు తృణీకరించి ఆయన్ని భూదేవి కర్పితం చేశాను. పెండ్లి కాకపూర్వమే గర్భాన్ని దాల్చి, పదిమందిలో తలెత్తుకు తిరగలేక....

కుమా:- ఇక్కడ కొచ్చావా?

పద్మ:- (ఔను అన్నట్లు తలూపుతుంది)

కుమా:- ఎందుకు?

పద్మ:- ఎందుకా? యీ చిట్టిపాపకోసం. మిమ్మల్ని తల్చుకుంటూ యింతవరకూ జీవించాను. యిప్పుడు దిక్కులేక మీ ఆదరాన్ని పొందటానికి పట్నం చేరుకున్నాను.

కుమా:- ఏం చేయమంటావ్? యీ విషయంలో నేను అసమర్థుణ్ణని యిదివరకే చెప్పాను ...మళ్లీ యిప్పుడు చెప్తున్నాను.

పద్మ:- మీ రింత కఠినత చూపిస్తే నే నాగలేను. ఆదరణలేని యీ అభాగ్యురాలి జీవితం ఏం కావాలి? మీ ప్రేమని మిమ్మల్ని ఆసించినందుకు దిక్కులేని పక్షిలాగ ఆ పంచా యీ పంచా పడి చావవలసిందేనా?

(శోభ ప్రవేశించి పద్మనుచూసి వెనక్కు తగ్గి పద్మ మాటలు వింటుంది)

పద్మ:- (పిల్లాణ్ణి చూపిస్తూ) యీ చిట్టిపాప తండ్రి ఆదరణ పొందలేని నిర్భాగ్యురాలు కావలసిందేనా? (బరువుగా) ఆనాడు మీరు చెప్పిన మాటలు, చేసిన ప్రమాణాలూ యీ నాడీ విధంగా మర్చిపోయి, నన్ను ఏడ్పించినందువల్ల మీ కేమన్నా లాభం వుందా? అటు కులంవారితో కలసి మెలసి తిరక్కుండా బహిష్కరించ బడ్డాను. యిటు మీ చేత తిరస్కరించబడి అసహ్యించబడుతున్నాను....నా కీ లోకంలో దిక్కెవరు? మనస్సిచ్చిన న్నిప్పు డీ విధంగా మారణ అగ్ని గుణ్ణాలకి బలివ్వటం మర్యాదేనా?

కుమా:- (కోపంగా) మర్యాద! మర్యాద!_

కుమా:- మళ్లీ నోరెత్తకు. అనవసర అతి ప్రసంగాలతో నాకు నిమిత్తం లేదు. నిన్ను ప్రేమించినమాట వాస్తవమే; కాని, ఆ రోజు లవి - యీ రోజులివి. వృధా ప్రయాసపడి నీ వెన్ని చెప్పినా నా చెవిని పట్టవు. ఒకవేళ పట్టినా నెరవేర్చటం కష్టసాధ్యం. నన్నడిగి నా దగ్గర ప్రాధేయ పడ్డందువల్ల వచ్చిన ప్రయోజనం లేదు.... వెళ్లు.

పద్మ:- ఆ! వెళ్లనా? యిది మీకు ధర్మమా? వాక్కుసారి న్యాయ దృష్టితో....

కుమా:- అవును. ధర్మాన్ననుసరించలేక, చేసిన ప్రతిజ్ఞ చెల్లించు కోలేక, అంధకారంలో దోవ తెలియక అధోగతిపాలవు తున్నాను.... అయినప్పటికీ పితృవాక్య పరిపాలనకి ఆదర్శ జీవి ననిపించుకోవాలి.

పద్మ:- అనిపించుకొవాలా? మాటల్తో మోసంచేసి ఒక అభాగ్యురాల్ని అంధకారం చేయటంలో ఎవరనిపించుకోవాలి? పెండ్లి చేసుకుంటానని ప్రమాణం చేశారు. నా జీవిత కుసుమం మీ కర్పించాను.... చేసిన ప్రమాణం మర్చిపోయి, మీ ఆనందంకోసం, మీ సౌఖ్యంకోసం, మరో అమ్మాయిని పెండ్లి చేసుకున్నారు. యిదేనా ఆదర్శ జీ వనిపించుకోటం? (ఆలో చించి) అవును. (కన్నీరు తుడ్చుకుంటూ) నా ధర్మాన్ని నేను నిర్వర్తించుకుంటాను. మీ ఆనందమే. నా ఆనందం- పతి క్షేమం కోసం భార్య ఏ త్యాగమైనా చేస్తుంది. భారత మహిళ యొక్క జీవితాదర్శమే అది. ఏ చేతుల్తో నన్ను వృద్ధిలోకి తీసుకొచ్చారో ఆ చేతుల్తోనే నా ప్రాణాలు

తీయండి. అప్పుడైనా కొంతవరకు శాంతి కల్గుతుందేమో!

కుమా:- మళ్ళీ పెళ్ళి చేసుకో - నామాట విను.

పద్మ:- మళ్ళీ పెళ్ళి! ఎందుకా మాటలు? భారత స్త్రీ తొలిసారిగా ఎవర్నయితే తన కంటితో చూసి మనస్సిచ్చి, శీలాన్ని అర్పిస్తుందో అతడే భర్త. అతనే ఆమె జీవనోపాధికి మార్గదర్శకుడు. మీ మాటలు విన్లేక నా హృదయం పగిలిపోతోంది. మీరు ఆదరించినా లేకపోయినా యీ జన్మకు మీరే నా భర్త.

కుమా:- వద్దు - (పెద్దగా) అది స్వప్నంలో జరుగదు. ముందు ను వ్విక్కణ్ణుంచి వెళ్ళిపోవాలి. లేకపోతే ఎలాంటి అపాయానికి ఆహుతౌతావో ఆలోచించుకో.

పద్మ:- (పిల్లాణ్ణి కుమార్ కాళ్లమీద పడేసి) నామాట వినండి. యీ పసికూనకోసమన్నా వినండి.

కుమార్:- (విసురుగా కొంచెం వెనక్కునడిచి) పసికూనకోసం నీ మాట వినాలీ? (జుట్టు పట్టుకు లాగుతూ) పోతావా పోవా? చెప్పు, లేకపోతే గెంటేస్తాను. ఊ-

పద్మ:- గెంటేస్తారా? నా యింట్లోంచి నన్ను గెంటేస్తారా? ఎవరా గెంటేది? నేనూ చూస్తాను. ఆడదానికి అన్యాయం జరుగుతుంటే దేవె మొహాలేసుకు చూస్తున్నది కాకుండా గెంటటానిక్కూడా వస్తారా? రానియ్యండి. ఎవ రొస్తారో చూస్తాను; ఎలా గెంటుతారో చూస్తాను.

కుమా:- (పెద్దగా) పద్మా!

పద్మ:- నే నేం తప్పుమాట లన్లేదు. యీ యిల్లు నాది. (ఏడుస్తూ

పాదాలు పుచ్చుకొని) నన్ను నిర్బంధించకండి. మీ సువర్ణ హస్తాలతో నా శరీరాన్ని ముక్కలు ముక్కలు చేయండి. ప్రతి ఎముకా మీకోసం కలవరిస్తోంది. ప్రతి రక్తనాళం మీరే భర్త అనే ఆశతో మీకోసం ఎదురుచూస్తూ పొంగి పొర్లిపోతోంది....ప్రతి నరం ఏమని ఘోషిస్తోందో వినండి! కుమార్!....కుమార్!!....అట్లా చూస్తారేం? ఊ- రండి.

కుమా:- నే నేం చేస్తున్నాను? ఎక్కడున్నాను? (నెమ్మదిగా) యిదంతా కలా - నిజమా? నేను చేసింది నిజంగా అక్రమమే! సహించరాని అన్యాయమే!! (తెల్లబోయి చూస్తూ నెమ్మదిగా) నే నామె శరీరాన్ని ముక్కలు చేయాలా? ప్రతినరం కుమార్ అని ఘోషిస్తోందా? .... అవును. ఎందుకు ఘోషించదు. నిజంగా నేను ద్రోహిని. నా తప్పు నేను తెల్సుకున్నాను. నేను చేసిన అన్యాయా నికి ఎందుకు ఘోషించదు?....(పశ్చాత్తాపపడుచు) పద్మా! (లేవదీసి) నాన్నమాటకు అడుగు దాటలేను. అందుగ్గాను నామాట విను. నాకోసం, నా ప్రేమకోసం, మన సౌఖ్యం కోసం వేరుగా వసతి యేర్పాటు చేస్తాను. అందులో వుంటూ వుండు.

పద్మ:- (సంతోషంతో) ఆహా! ఎంత సంతోషమైనమాట విన్నాను. చాలు....మీ చల్లని మాటల్తో వాడిపోయిన నా జీవిత కుసుమం వికసించింది. యీ చిట్టి పాపడు తండ్రి ఆదరణ పొందగల్గాడని గర్వించి సంతోషిస్తున్నాను. చీకటి తెరల్ని

చీల్చుకుంటూ దారీ తెన్నూ తెలియక అర్ధంకాని అగాధంలో పడి నిస్పృహతో జీవించాలని బాధపడ్డాను; కాని, యీనాడు మీనోటి వెంట వెలువడిన తీయని పలుకులు నా వుద్దేశాన్ని మార్చి, సుఖంగా జీవించమని ఆశీర్వదించాయ్. మీ పాదసేవ చేసి తరించే అవకాశం యీ నాటికి కల్గింది. మీ గౌరవంకోసం, నా సంతోషంకోసం, మీ కళ్ల ఎదుట వేరే వున్నా సంతోషమే....మీరు....

కుమా:- రోజూ వస్తాను .... చూడు, నువ్వెళ్లి ఆ గేటు దగ్గర అరుగుమీద కూర్చో; యిప్పుడే వస్తున్నాను.

(పద్మ సంతోషంతో నిష్క్రమిస్తుంది. కుమార్ కోటు తొడుక్కొని బయలుదేరబోగా శోభ అదే మార్గాన ఎదురౌతుంది)

శోభ:- (ఆక్షేపణగా) పాపం తలనొప్పిగావున్నా ఎందాకా బయలుదేరారు?

కుమా:- (విసుగ్గా) ఏముంది. అనవసరంగా నా విషయంలో జోక్యం కల్గచేసుకోవద్దని, యిప్పటికి సరిగా లక్షసార్లు చెప్పాను. షేమ్లెస్ గూస్! (వెళ్లబోతాడు)

శోభ:- (అడ్డుతగిలి) వెళ్లటానికి వీల్లేదు.

కుమా:- ఏం? నీ అదుపులోకూడా వుండాలా?

శోభ:- ఉండి తీరాలి. పతి ప్రవర్తనను సరిదిద్దుకోటంలో భార్యకి సర్వహక్కులూ వున్నాయ్.

కుమా:- అట్లాగా! (వెళ్లబోతాడు)

శోభ:- చెప్పేది మీకే. (అడ్డు తగులుతుంది)

కుమా:- (బలంగా ప్రక్కసోఫాలోకి తోసి) నో రెత్తావా మర్యాద దక్కదు. కుక్కినపేనులాగ పడుండు. (చరాచరా వెళ్తాడు)

శోభ:- ఈ బ్రూటుని మారేజ్ చేసుకోటం ముఖ్యంగా నాదే తప్పు. పెండ్లి చేసుకొని, ప్రేమిస్తున్నట్లుగా నటిస్తూ, చంకపిల్లాడితోవున్న ఒక అనాధను ప్రేమించి, అగ్ని సాక్షిగా పెండ్లి చేసుకొన్న నన్ను అన్యాయం చేయ చూస్తాడా! యిట్లా ఎంతకాలం ఆడతాడు యీ కపటనాటకం? నే నంటే గిట్టనట్లుగా వుంటుంటే ఏమిటో అనుకున్నాను. యిదా సంగతి....(ఆలోచిస్తూ) నా ప్రేమకు అడ్డుతగిలిన ఆ కులట అంతు తేల్చుకుంటాను. జాగుచేస్తే నా జీవితం వోయాసీస్ లేని సహారాలా తయారవుతుంది. బహుశా యికముందు వూళ్లోనే వుంటుంది గాంసు. చూపిస్తా మన గట్టితనం....

మధు:- (తొందరగా ప్రవేశించి) వాట్ శోభా! పది నిముషా లన్నావ్ - అరగంటైంది. యింకో గంట యిక్కడే వుండిపోయామా అంటే అన్నీ యిక్కడే పూర్తవుతా యల్లేవుంది.

శోభ:- ఏమిటి?

మధు:- బాట్మెంటన్ - సినిమా -

శోభ:- (ఆలోచిస్తూ వుంటుంది)

మధు:- (శోభని పరిశీలించి) వాటీజ్ దిస్ (What is This) అప్పుడే నీలో యింతమార్పు వచ్చేసిందేమిటి? ఎందుకల్లా

బ్యూటిఫుల్‌గా బాధపడ్డావ్? ఏవర్ని గురించి? మనహాస్పేం దేమన్నా అన్నాడా? బాధేమిటో చెప్పు.

శోభ:- ఇట్లాంటి బ్రూటుని మారేజ్ చేసుకుంటే ఎందుకు బాధ పడను.

మధు:- (తనలో) ఏదో కీచులాడుకొనుంటారు. సినిమా, డాట్ మెంటల్ల సంగ తెల్లావున్నా - సంగతంతా వివరంగా తెలుసుకొని, బ్యూటిఫుల్‌గా సంతోషించి, ఏనాటినుంచో జాగ్రత్తగా దాచివుంచిన నా అప్లికేషన్ దాఖల్ చేస్తాను. (శోభతో) బ్యూటిఫుల్ శోభా! కధ అడ్డం తిరిగిందను కుంటాను. (అంటూ సిగరెట్ ముట్టిస్తాడు)

శోభ:- (తనలో) నే చేయబోయే ప్రతీకారానికి మధు సాయ పడతాడేమో.... అయినా ప్రయత్నించి చూస్తాను. (పైకి) నీలాంటి డియరెష్టుఫ్రండ్ వున్నా లేనివాళ్లతో జతే - అవసర మైనప్పుడన్నా సాయపడతారా ఏమన్నా నా?

మధు:- డ, డ, డ, డ, డ - ఎంతమాట -

అరులన్ జంపుటో, యుద్ధమందునను
హత్యాచారముల్ సేయుటో
గరువంబున్ విడగొట్టుటో, ఎవనికిన్
కార్యాను కూలత్వ మే
ర్పరుపన్ చేయుటో చెప్పుమా
తడవికొప్పన్ బాల నేనింక నీ
కరమున్ బట్టి వచించెదన్
వినగదే కాంతా శిరోరత్నమా!

నీ కోసం నీ క్షేమంకోసం ఏం చేయమన్నా చేస్తాను. ఏం తినమన్నా తింటాను; ఎవణ్ణి తిట్టమన్నా తిడతాను. ఎవ ర్నన్నా పత్రికల్లో ఏకమనూ, హాఁ అమోఘంగా రెండు పేజీలు ఏకిపారేస్తాను. ఎవర్నన్నా చంపమను, యిట్టె తేలిగ్గా (నెమ్మదిగా) చంపిపారేస్తాను.

శోభ:- ఆ! అదే కావాలి.

మధు:- (గుడ్లు తేలేస్తూ) చంపటమా!

శోభ:- యస్.

మధు:- బ్యూటిఫుల్! ఆ పని మాత్రం చస్తే చెయ్యను.

శోభ:- ఏం? యిప్పుడేదో అన్నావే?

మధు:- ఆ! మాటవరుసకు అన్నాను గాని, ఆ పని మనం చేశామంటే, వద్దన్నా సరే, వీర్ని శ్రీకృష్ణజన్మస్థానానికి కట్టేసి మరీ తీసుకుపోతారు. న న్నెందుకు చంపుతావు? అటువంటి పనులు మాత్రం- ప్లీజ్....నాకు చెప్పకు.

శోభ:- ఇంతేనా మరి - పెద్ద మొగాడిలాగా మాట్లాడావ్!

మధు:- ఆ! కాదా మరి.

శోభ:- అనే అనిపిస్తోంది. కాకపోతే యిందాకనుంచి చెప్పిన మాటలేమిటి? అంతలోనే యింత భయమేమిటి?

మధు:- (దగ్గరకొస్తూ ప్రేమగా) యితరుల విషయాల్లో ను వ్వే దన్నా ఒప్పుకుంటాను కాని, నీ విషయంలో నీ యిష్టం వచ్చిన పనిచెప్పు -నిస్సందేహంగాచేస్తాను....చేస్తాను.... చేస్తాను....(నెమ్మదిగా) అ అ ఆ అంతే .... చేయటానికి యీ బానిస సిద్ధంగా వున్నాడు. యింతెందుకు? నువు 'క్షా'

అంటే బే ఆఫ్ బెంగాల్లో దూకమన్నా అయామ్ రడీ.

శోభ:- అయితే నే చెప్పినట్లు చెయ్. నీకు వచ్చిన భయ మేమీ లేదు. నువ్వీపాటిసాయం చేశావంటే, దానికి రెండు రెట్లు సాయం నీకు చేస్తాను.

మధు:- (తనలో ఆలోచిస్తూ) బహుశ మొగుణ్ణే చంపమంటుం దేమో - అయితే మరీ మంచిది. మరుక్షణంనుంచి శోభ హృదయానికి మనం కిరీటంలేని రాజులం - అంటే ప్రభువన్నమాట. (శోభతో) శోభా! రెండు రెట్లూ వద్దు, నాల్గు రెట్లూ వద్దు, వొకే వక షరతు - ఏమిటంటే, నీమాట విని, నీవు చెప్పినపని నే చేసేటట్లు, దానికి ప్రత్యుపకారంగా ఎంతకాలంనుంచో తీరనికోరికలతో కుమిలిపోయే నా హృదయబాధను నువు తీర్చేట్లు——

శోభ:- ఏమిటా బాధ ?

మధు:- బ్యూటిఫుల్‌గా అడిగావ్. నీ కోర్కె నెరవేర్చిన మరు క్షణం నుంచి మనం, వొకరి నొకరు విడువకుండా, అల్లా ——అల్లా——అల్లా——

శోభ:- అదా నువు కోరేది? (తనలో) పెద్దచిక్కే వచ్చిందే! తల్చుకున్నపని నెరవేరేవరకు 'సరె' అంటే తీరిపో తుందేమో (ఆలోచించి మధుతో) మధూ! ఎందు కంత శ్రమపడతావ్? ఆ మరుక్షణంనుంచి నీ కోర్కె ప్రకారం శోభ నీదే.

మధు:- ఓ మై గాడ్ (సంతోషంతో) అయామ్ వెరీ గ్లాడ్ —— అయితే మరి నమ్మకం?

శోభ:- నాకు మాత్రం ?

మధు:- దానికేం? మ నిద్దరం ప్రమాణాలు స్వీకరిద్దాం. ముందు నేను. (శోభచేయి నెమ్మదిగా లాగి తన చేతిని ఆమె చేతిలో వుంచి) తప్పకుండా నీ కోర్కెను బ్యూటిఫుల్‌గా నెరవేరుస్తాను—నీ సంగతి?

శోభ:- ఇదిగో (చేతిలో చెయివేస్తుంది)

మధు:- (శోభ చేతిని గట్టిగా పట్టుకొని హృదయానికి హత్తుకొని ముద్దు పెట్టుకోబోతాడు)

శోభ:- (చేతిని బలంగాలాగి) అన్నీ యిప్పుడేనా?

మధు:- ఇహిహిహి - ఫరవాలేదులే - యిక్కడ మనిద్దరం తప్ప ఎవరూ లేరుగా—ఆ! చూడు శోభా! 'ఆలశ్యం అమృతం విషం' అని అన్నాడు ఎక్కడో జార్జి బెర్నార్డుషా. అందుకని వెంటనే చెప్పెయ్ - ఎవర్ని, ఎందుకు, ఎక్కడ ఏటైమ్‌కి చంపాలో చెప్పు; ఊ ( చెప్పు. (నెమ్మదిగా) అబ్బ, చెప్పు శోభా డియర్!

శోభ:- ఇట్లాంటి పనులు మంచి ఆలోచనమీదగాని చేయటానికి వీలుండదు. అందుకని రేపు మనిద్దరం కూర్చొని డీప్‌గా ఆలోచించి చేద్దాం.

మధు:- అస లెవర్నో చెప్పు?

శోభ:- తొందరపడ్తావేం? చెప్తానుగా!

మధు:- అదికాదు. నన్ను అర్థం చేసుకోవేం? తల్చుకున్నపని పూర్తయ్యేవరకూ మధు నిద్రపోడు. అందుకని—

శోభ:- అందుకనీలేదు యిందుకనీలేదు. నా మాట విను; రేపు

చెప్తాను.

మధు:- రేపటిదాకా ఎందుకని?

శోభ:- ఆలోచించి మరీ చెయ్యాలని చెప్పానా?

మధు:- ఆహాహ - అదికాదు. ఆలశ్య మవుతున్నకొద్దీ, చేయ దల్చుకొన్న పనిమీద వుత్సాహం సన్నగిలి, నిరుత్సాహం ఎక్కువవుతుందేమోనని భయం. అంతకంటే ఏమీలేదు.

శోభ:- అయితే విను .... (సందేహిస్తూ) యిప్పు డొద్దులే.

మధు:- సంశయాల కిప్పుడు సమయంకాదు. ఏదోవిధంగా ఒక నిర్ణయానికి వచ్చి పని కానిచ్చెయ్యాలి. (గర్వంగా) తర్వాత మనం మన ప్రణయ సామ్రాజ్యాన్ని పరిపాలిస్తూ పరిపూర్ణానుభూతిని పొందాలి. ఊ- త్వరగా ....

శోభ:- (అటూ యిటూ చూసి) ఒక నిండుజీవితాన్ని రక్తపు చుక్క బయటకి రాకుండా నిర్మూలం చేయాలంటే ఏం వుపయోగించాలి?

మధు:- హుష్- యిదేనా....హతమార్చడానికి చిటికెడు పొడుం చాలదూ?

శోభ:- యక్సలెంట్ అయిడియా! అయితే యింకేం? ముందా మందు సంపాదించు.

మధు:- వెధవమందు. కాకిచేత కబురు పంపితే వచ్చిపడుతుంది. కన్నుమూసి కన్ను తెర్చేలోపుగా తీసుకొస్తాను. గుడ్‌బై ....(అంటూ వుత్సాహంగా వెళ్తాడు)

శోభ:- పాపం - అమాయకుడు!

—తెర—

# ప ల్లె పి ల్ల

## ఏ డో రం గం

(వీధిలో మధుసూధన పంత్ వంట్రిగా సిగరెట్ పీలుస్తూ ఆలోచిస్తూ ప్రవేశ్తాడు)

మధు:- విచారించి చూ స్తే శోభ ఎవర్ని చంపమంటుందో తెలియటల్లేదు.... మొగుణ్ణే చంపమంటుందో, నక్కానే చంపమంటుందో - ఎవర్ని చంపమంటే నాకేం? శోభకోసం, శోభ ప్రేమకోసం, ఎవర్ని చంపమన్నా యీ మధు సిద్ధపడాల్సిందే - లేకపోతే శోభ నాకు లభించదు. (అటూ యిటూ చూసి జేబులోనుంచి పొట్లంతీసి పరికిస్తూ) యీ మందు సంపాదించటానికి ఎంత శ్రమ పడ్డానో శోభకేం తెల్సును....రక్తపుచుక్క బయటకురాకుండా విషాన్నిచ్చి చంపటంలో మధు నేర్పరి. (ఆలోచిస్తూ) కాని, దీని దుంపతెగ వేసిన వెంటనే ప్రాణం పోదుకదా. డీప్‌గా ఆలోచించి చూ స్తే, పల్లెపిల్ల పద్మకే ఎసరెట్టేటట్లుగా కనిపిస్తోంది. కాకపోతే మనన్నెందు పిల్చుకురమ్మంటుంది? (పద్మ కొట్టిన చెంపదెబ్బ గుర్తుకు తెచ్చుకొని దవడ నవిరించుకుంటూ) ఆరోజున వున్నట్టే వుండి మనతో చెప్పకుండా, మన అంగీకారం తీసుకోకుండానే ఫెడేలున మన దవడ దర్జాగా సదునుచేసిపారేసింది.

పదును చేసిందే అన్న అవమానం లేదు కాని, నలుగుర్లో నవ్వుల పాలయ్యేనే అనే నామర్దా నా హృదయంలో నాట్యం త్రొక్కుతోంది. అప్పటినుంచి చెప్పకుంటే సిగ్గుచేటు - (అటూ యిటూ చూస్తూ నెమ్మదిగా) అదే మిటో ఆమెపేరు విన్నప్పుడల్లా గాల్లో దీసంలాగ మన గుండెలు టపటపా కొట్టుకుంటున్నై .... శోభాదేవి 'పద్మా' నని చెప్పింనాంటే, యిహ చూసుకోండి మన వ్యవహారం ....(హృదయం మీద చెయివేసుకొని భయపడతాడు) కాని వొక ధైర్యంమాత్రం నన్ను ముందుకు నడిపించి ప్రోత్సహిస్తోంది.... ఆపని 'యిద్దరం కలిస్తే ఏటికెదురో చెయ్యలేమా' అని. అదీ గాకుండా ధైర్యమే సాహసం .... సమయంవస్తే శోభకి మనం (గర్వంగా) అగ్నిదేవుడికి వాయుదేవుడు సాయపడ్తే పడతాం. బహుశా నైన్టీ నైన్ పర్సెంటు నా వూహే నిజం కావచ్చు. అందుకే ఫోర్జరీ చేసి రాంగ్ లెటర్ రాసి పారేసింది. పాపం యీ పాటికే మా డియర్ వ్రాసిన దొంగ వుత్తరం ద్వారా కుమార్ ముద్దుల పల్లెపిల్ల ప్రయాణ సిద్ధమై వుంటుంది. కాని పానకంలో పుడకలాగ ఆముసలి పీనుగు నారాయణరావు కూడా యిప్పుడే తగులడ్డాడుకదా! కుమార్ కాంప్ కెళ్లాడుకదా, నేను మా శోభా సంతోషిస్తుంటే సమయానికే తయారయ్యాడు ముసలాడు .... ఎక్కడికి పోయాడో కాని సమయానికి యింట్లో లేనందుకు కొంత వరకు సంతోషం. ఏ పార్కుకో పోయుంటాడు. ఆ ముసలాడు యింటికి రాకమునుపే మా పద్మవ్యూహం

పద్మ మీదేనని మా డియర్ శోభ చెప్పిందంటే, క్షణంలో అంటే ఆముసలాడు యింటికి రాకపూర్వమే పని పూర్తి చేస్తాను. అక్కడితో మన అదృష్టం పండి బయటపడు తుంది. (కామోద్రేకంతో) శోభ సంతోషించి ఆమె ప్రేమని (నాలుక చప్పరిస్తూ) మనకి అందిస్తుంది........ ఆహా! అందుకే గాంసు - ప్రేమ ఏం చెయ్యడానికైనా వెరవనివ్వదనీ, లౌకోసం లైఫ్‌నే శాక్రిఫైజ్ చెయ్యాలనీ అన్నాట్ట పోతనామాత్యుడు. లౌ యీజ్ బ్లైండ్ అన్నాడు వెనకేదో మాటల సందర్భంలో తాతాచారి....అరె, యిప్ప టికే చాలా ఆలశ్యమైపోయింది. వెళ్లి వెంటనే కార్యరూపం లోకి తీసుకొస్తాను. బ్యూటిఫుల్‌గా మీరే చూస్తారుగా యీ మధుసూధన పంత్ తడాఖా! (కూనిరాగం తీస్తూ సిగరెట్ ముట్టించి నిష్క్రమిస్తాడు)

(తెర ఎత్తుసరికి మూడు కుర్చీలు, మధ్య ఒక టేబిలు వుంటాయి. టేబిల్ మీద ఏవో కొన్ని పుస్తకాలు, ఫ్లవర్ కూజా వుంటాయి. ప్రక్కనే లా పుస్తకాలతో నిండిన బీరువా వుంటుంది. పద్మ పిల్లాణ్ణెత్తుకొని మధుతో ప్రవేశిస్తుంది.)

మధు:- ఇక్కడ కూర్చోండి - వెళ్లి వార్ని తీసుకొస్తాను.

పద్మ:- వా రింట్లో లేరా?

మధు:- అహహ - లేరు....ఎందుకూ యిప్పుడే వస్తారు - అంత వరకూ ఎందుకు?....నేను తీసుకొస్తానుగా (వెళ్లబోతాడు)

పద్మ:- వారే తీసుకురమ్మన్నారని చెప్పావ్?

మధు:- చెప్పాను.

పద్మ:- అయితే ఆమాటల్లో అర్థం?

మధు:- పెడర్థం - కాదు కాదు, వారు నాతో చెప్పి, ఎక్కడికో వెళ్లి- అహహ తీసుగొస్తాను. (చరచరా వెళ్తాడు)

పద్మ:- బాగుంది. తన్ని నా కోసం పంపారని చెప్పి, నన్ను తీసుకొచ్చి, యిక్కడ వంటరిగా కూర్చోపెట్టి వార్ని తీసుగొస్తానని వెళ్లటం దేనికో అర్థం కావటల్లేదే! అబ్బ - ఎడంకన్ను అదే పనిగా అదురుతోందే - పరిస్థితులు ఏవిధంగా పరిణమిస్తాయో తోచటల్లేదు. (అటూ యిటూ చూసి) ఎవరూ లేనట్లుందే. (ఆశ్చర్యంగా గోడకు అలంకరించబడ్డ ఫుటోలవంక చూస్తూ) అరె, ఆనాడు నేనూ వారూ కలసి తీయించుకున్న ఫొటో యిక్కడే తగిలించారే! (ఆలోచిస్తూ అటూ యిటూ తిరుగుతూ వుంటుంది)

శోభ:- (ప్రవేశించి) అరె, నిల్చునే వున్నారేం? కూర్చోండి.

పద్మ:- ఫరవాలేదు.... వారు....

శోభ:- వస్తారు. ఎవరో పార్టీ లో స్నేను సాగనంపటానికి సాయం వెళ్లారు.

పద్మ:- '(అట్లాగా' అన్నట్లు తలూపుతుంది)

శోభ:- మీరు చాలా మంచివారండి. మీ సంగతి అప్పుడప్పుడు మనవారు చెప్తూ వుంటారు. అదేమిటో మీ సంగతి వింటున్నకొద్దీ వినాలనిపిస్తుంది.

పద్మ:- (చిరునవ్వు నవ్వుతుంది)

శోభ:- మనిద్దరం యిహాముందు కలసిమెలసి ఒకే యింట్లో

వుందాం. ....ఏమంటారు?

పద్మ:- మీ రామాత్రం ఆదరాభిమానాలు చూపి స్తే నేను కాదం టానా? వా రిష్ట మెల్లా వుంటే అల్లా చేద్దాం.

శోభ:- మీరొచ్చి యిక్కడుంటే వారు మాత్రం కాదంటారా?

పద్మ:- కాదన్ను - అందువల్ల వారికి....

శోభ:- భయం లేదులెండి - నేను చెప్తానుగా! మీరు 'సరే' ననండి.

పద్మ:- (సందేహిస్తుంది)

శోభ:- సందేహానికి సమయంకాదు. అసలు వారు మిమ్మల్ని ప్రేమించినట్లు, మీ రిద్దరూ ప్రమాణాలు చేసుకున్నట్లు నా కిదివరలో తెలియదు.

పద్మ:- ఇప్పు డెలా తెలిసింది?

శోభ:- మొన్నెదో మాటల సందర్భంలో వారే చెప్పారు. నా మనస్సుండబట్టలేక ఆ మర్నాడే మిమ్మల్ని కలుసు కున్నాను. అప్పటినుంచి మీరంటే నాకొక విధమైన ప్రేమాభిమానాలు హెచ్చయినాయ్. అదీగాక వారిదృష్టిలో మనిద్దరం సమానులమే నని అనుకుంటున్నాను. వారి ప్రేమను స్వీకరించటంలో మనిద్దరికి సమానమైన హక్కుంది. అంచేత నామాట వినండి. మనిద్దరం కలిసే వుందాం.

(ఇంతలో పద్మ కొడుకు ఏడుస్తాడు. శోభ అందుకుం టుంది)

శోభ:- స్వామినాథన్! బాబుని తీసుకు ఆడింపు.

స్వామి:- (ప్రవేశించి) అమ. (పిల్లాణ్ణి అందుకొని నిష్క్రమిస్తాడు)

శోభ:- ఆ! మర్చేపోయాను. మొన్ననేదో పాడుతుంటేను హటాత్తుగా వారొచ్చి 'పద్మచూడు ఎంత కమ్మగా పాడుతుందో' అన్నారు. ఏది, మీరు పాడే ఆ మధురమైన పాటలు నాక్కూడా వినిపించకూడదూ?

పద్మ:- దానికేం లెండి. తప్పకుండా పాడతాను. యింతకీ వారెందుకు పిలిపించారూ అని?

శోభ:- సరిపోయింది. మీకు తెలియదూ? యీ రోజున వారి పుట్టినరోజు పండుగ. అందుకని వారు వారి సతీమణులతో వొక గంటసేపు కులాసాగా కాలం వెళ్లబుచ్చాలని పిలిపించివుంటారు. (నవ్వుతుంది)

పద్మ:- (శోభతో కలిసి నవ్వుతుంది)

శోభ:- ఏది, వొకపాట పాడండి.

పద్మ:- ఏవీ గుర్తుకు రావటంలేదండీ.

శోభ:- అదేమిటండి; ఏదో వకటి పాడండి. యింగ్లీష్ ట్యూన్సేవీ రావూ?

పద్మ:- రావండి.

శోభ:- సినిమా పాటలు?

పద్మ:- రావు.

శోభ:- పోనీ - జాతీయగీతాలు?

పద్మ:- అంతగా రావు.

శోభ:- భావగీతాలు?

పద్మ:- మొన్ననే వొకటి నేర్చుకున్నాను. అదికూడా సరిగారాదు.

శోభ:- ఫరవాలేదు, వచ్చినంతవరకే పాడండి, చాలు.

పద్మ:- పాట

పాడవే - కోయిలా
ఆడుచు పాడుచు
నా మనసు మరపించు.... ॥పాడ॥
కొమ్మ కొమ్మకు ఏగి
కమ్మగా పాడాలి
నీ మధుర గొంతుతో
నన్ను మరపించాలి.... ॥పాడ॥
చల్లని వెన్నెల్లో
తీయని రాగాలు
తీరుగా తీయాలి
పరుగు పరుగున వచ్చి
పాట పాడాలే, నా కలత తీర్చాలే ॥పాడ॥

శోభ:- (తనలో తన్మయత్వం చెందుతూ) చాలా బాగుంది. యీ పాట నా క్కూడా నేర్పరూ? నిజంగా వారు చెప్పినట్లు గొప్పగా పాడారు.

పద్మ:- (నవ్వుతుంది)
(మధుసూధనపంతు హడావుడిగా ప్రవేశిస్తాడు) శోభా పద్మలు ఒక్కసారిగా మధుని చూస్తారు)

మధు:- వస్తున్నారు.... అహహ - వస్తానన్నారు.

శోభ:- ఎంత సేపట్లో?

మధు:- ఇంత సేపని వారు చెప్పనూ లేదు, మనం అడగనూ లేదు.

పద్మ:- వారెవరు?

మధు:- ఎవరేమిటి? బాగా అడిగారు. నే నెవర్నేమిటి? నేను నేనే! యింతకు ముందు తమర్ని యిక్కడకు తీసుకొచ్చింది నేనే కదూ; (నవ్వి) అప్పుడే మర్చిపోయారూ? నాపేరు మధుసూధనపంత్ అంటారు. ఆ రోజున .... అ హహ ఏమీ లేదులెండి. (లెంప సవరించుకుంటాడు)

పద్మ:- (శోభతో) అంటే, వీరు మీకు కావలసినవారా?

మధు:- అవును.

శోభ:- కాదు. మనవారి ఆంతరంగిక మిత్రుడు.

పద్మ:- ఏంపని చేస్తూవుంటారు?

మధు:- బ్యూటిఫుల్‌గా అడిగారు. నేను చేసేపని యిప్పటికే చాలా భాగం మీకు అర్థమైవుంటుంది. అడిగితే అడిగారు. మళ్లీ చెప్తే బాగా అర్థం చేసుకుంటారు. వొకటి 'స్త్రీస్వాతంత్ర్యం' అనే నాటకం వ్రాసి పబ్లిష్ చేసపారేశాను. యింకా దేవుడు మేలుచేస్తే స్త్రీ సమస్యలను ఆదర్శంగా తీసుకొని, వాళ్లను గురించి గుక్కతిప్పుకోకుండా లెక్చర్లిచ్చి పారేస్తాను. ఇంతెందుకు? శోభాదేవిగార్కి మన సంగతి, మనం చేసేపని, అన్నీ బ్యూటిఫుల్‌గా తెలుసును.

శోభ:- (విసుగ్గా) సరిలె. ఏమి టా చాదస్తపు వాగుడు. (మధుని సమీపించి రహస్యంగా) నేను చెప్పినట్లు ఒక గ్లాసులో ఆ మందు కలిపి, ఆగ్లాసు గుర్తుంచుకొని జాగ్రత్తగా యివ్వు.

మధు:- (రహస్యంగా) ఎంతమాట - బ్యూటిఫుల్‌గా యిస్తాను. చూస్తావుగా యీ మధుసూధనపంత్ పనివాడితనం. (పైకి)

ఆయనే వస్తాడులే మళ్లీ న న్నెందుకు చంపుతావ్.

శోభ:- సరె, నీయిష్టం. (పద్మని సమీపించి దాహంగా వున్నట్లు నటిస్తూ) అబ్బ దాహంగా వుంది. (మధుతో) మిష్టర్! నువ్వేమీ అనుకోకుండా వుంటే నే నొక మాట చెప్తాను. కా స్త....

మధు:- వాట్ (What) సందేహిస్తారేం? చెప్పండి.

శోభ:- కుర్రాణ్ణి డ్రింక్సు తెమ్మని పంపాను - తెచ్చాడేమో చూసి యిక్కడికి పంపుతారూ ?

మధు:- పంపటమేమిటి నాన్సెన్సు - నేనే బ్యూటిఫుల్‌గా తీసుకొస్తాను. అసలు ఆడవాళ్లకు శేవచేయటానికేకాదూ మనం అవతరించింది. పంతులుగారు పుట్టినప్పుడే మా అమ్మగారు 'స్త్రీసేవ' అనే ఔషధాన్ని అముదంలో కలిపి, రంగరించి అమృతంలాగా వీరి గొంతులో పోసింది. హహహహ - తీసుకొస్తాను.
వాహావా

(చరచరా వెళ్తాడు. శోభ, పద్మలు విరగబడి నవుతారు)

శోభ:- మధు మంచి సరదాగల మనిషి.

పద్మ:- అవును. అన్నివిధాలా........

శోభ:- ఆ! ఆ! అనుకూలంగా వుంటాడు....వా రింకా రాలేదే - పండగనాడు కూడా పార్టీల హడావిడే - నిజంగా మన వా రెంత పుణ్యం చేసుకుంటేనో మనలాంటి సతీమణులు దొరికారు. లేకపోతే వారి ఆట లీ విధంగా సాగేవేనా?

పద్మ:- అదేమిటండి. మగవారు కదూ. అనేకం వస్తుంటాయి - వస్తారు.

(పద్మ, శోభలు నెమ్మదిగా మాట్లాడుకుంటూ వుంటారు. మధు రెండు డ్రింకున్న గ్లాసులు ఒక ప్లేటులో పెట్టుకు ప్రవేశిస్తాడు)

మధు:- (తనలో) ఈ దెబ్బతో పద్మ ఢాం - తర్వాత శోభాదేవి గారు యీ మధుసూధన వంత్ గారి ప్రేమకు దాసురాలు. అప్పటినుంచీ కుమార్ జీవితం అయోమయ అంధ కారాలలో అర్థం కాకుండా బాధ పడాల్సిందే. యీ క్షణంలో యిది. మరుక్షణంలో అది. ఏది ఎట్లావున్నా నేను, శోభ ప్రణయ వీధుల్లో విహరిస్తానికి ప్రయాణం కట్టటం మాత్రం ఖాయం. బ్యూటిఫుల్-వెరివెరీ బ్యూటిఫుల్ [అంటూ వళ్లుతెలియని ఆనందంతో వకరిగ్లాసు మరొ కరికి మార్చిస్తాడు. శోభ గుండెల్లో బాధ బయల్దేరుతుంది. పద్మ గాబరా పడుతుంది. మధు మతి చెడిపోయి పారి పోవాలని ప్రయత్నిస్తాడు. పద్మ ధైర్యంతో దారికి అడ్డు నిలుస్తుంది. మధుకు వళ్లు తెలియని ఆవేశం పెరిగి పోతుంది]

మధు:- లే!

పద్మ:- ఏమిటీ దౌర్జన్యం? ఎక్కడికి కెడతావ్ ?

మధు:- అది నీకు అనవసరం. ముందు లే - వెళ్లిపోవాలి.

పద్మ:- వెళ్లటానికి వీల్లేదు.

మధు:- మర్యాదగా చెప్తున్నాను, విను. వినకపోతే నీ రక్తం కళ్ల చూస్తాను. తెలిసిందా? ఊ - లే!

పద్మ:- ఏమయినా సరే, లేవను. (విచారంగా) పాపం! అన్యా

యంగా అక్రమంగా ఆవిణ్ణి చంపి, నిండు ప్రాణాన్ని నిలువునా నాశనం చేసి పొట్టనెట్టుకోవాలని ఆవిడచేత విషం త్రాగిస్తావా? నీవు మనిషివేనా? నీలో మానవత్వ ముందా? నిన్ను నిల్చోపెట్టి నిలువునా కాల్చినా పాపం లేదు.

మధు:- పద్మా!

పద్మ:- నిన్ను మానవు డనేదానికన్నా రాక్షసు డంటే మంచిది.

మధు:- (పెద్దగా) నోర్ముయ్!

పద్మ:- అంతకంటే దుర్మార్గుడివి. నీకు బుద్ధి లేదూ? నిష్కారణంగా ఆవిడిచేత ఆ విషా న్నెందుకు త్రాగించావ్? పైగా పారిపోవటానికి ప్రయత్నం చేస్తున్నావా?

మధు:- లేవమని చెప్తున్నాను. ఊఁ, ముందు అడ్డులే. లేకపోతే నువ్వుకూడా అంతమవుతావ్. ఊఁ (రెం డడుగులు వేస్తాడు)

పద్మ:- ఆగు, ఏమి టా దౌర్జన్యం? ఒక్క అడుగు ముందుకు వేశావా నీ ప్రాణాలు నీకు దక్కవ్, జాగ్రత్త!

(మధు వికటంగా నవ్వుతూ పద్మని సమీపించి పద్మ భుజాలు పట్టుకొని మళ్ళీ నవ్వి వెనక్కు తోస్తాడు. అదేసమయాన కుమార్ Camp నుంచి వచ్చుటచేత పద్మని పట్టుకుంటాడు.)

మధు:- (భయంతో నీరసంగా) బ్యూటిఫుల్ - బ్యూటిఫుల్!

పద్మ:- కుమార్!

కుమా:- పద్మా! యిక్కడి కెందుకు వచ్చావ్? మధూ! ఏమి టిది?

మధు:- (విచారిస్తూ కుమార్ పాదాలు పుచ్చుకొని) కుమార్! కామాంధకారంతో నా కళ్ళకి పొరలు కమ్మి నేను చేసిన కుట్ర నాటకం....క్షమించు నీ సంసారాన్ని నిలువునా నాశనం చేశాను. నిన్ను అన్యాయం చేసి శోభని అపహరించాలని ప్రయత్నం చేశాను. శోభ నా కోర్కె చెల్లించాలంటే ఆమె కోర్కెను నేను తప్పనిసరిగా చెల్లించాల్సి వచ్చింది. అది పద్మని చంపటమే. అందుకే భగవంతుడు మాకు తగిన ప్రతిఫలం ప్రసాదించాడు. కుమార్! తెలిసో తెలియకో చేసిన యీ నా తప్పు క్షమించు.

కుమా:- (కాలితో తన్ని) నీచుడా! రక్తంత్రాగే రాక్షసుడివి. నీకు బుద్ధి లేదు. పశ్చాత్తాప మనేది నీ కుందా? సిగ్గు లేక క్షమించమని అడగటానికి నీకు నో రెల్లా వచ్చింది? నీ కోసం, నీ స్వార్థంకోసం ఎంత ఘోరానికి పాల్పడ్డావ్! పరువు ప్రతిష్టలు పాటించలేని పశువా! నిన్ను క్షమించ కూడదు. నీలాంటి స్వార్థపరులు చస్తేనేకాని యీ సంఘం బాగుపడదు. ముందు సు వ్వేమవుతావో ఆలోచించుకో. (ప్రక్కకు తిర్గి) స్వామినాధన్! (స్వామినాధన్ ప్రవేశం) ఆ తా డిలా అందుకో. (మధుని కాళ్ళూ, చేతులూ కట్టి పడేసి) వెళ్లి పోలీసుల్ని తీసుకురా.

శోభ:- (బాధపడుతూ కుమార్ని చూసి నెమ్మదిగా) కుమార్!

కుమా:- శోభా? (సమీపించి తన వళ్లోకి తీసుకుంటాడు)

శోభ:- బాధతో ఆయాసంగా చెప్పలేక చెబుతుంది) కుమార్! మన్నించు. చదువుకున్నందువల్ల నాలో కల్గిన సంస్కా-

రాన్ని వుపయోగించుకోటం చేతగాక - పాపం - పద్మన్ని నా స్వార్థంకోసం చంపాలని ప్రయత్నించాను. నిజంగా స్త్రీ వ్యామోహంలో మునిగిపోయిన మధు నిర్దోషి. అమాయకుడు. (బాధ ఎక్కువై) నిజమైన ప్రేమ ప్రతి ఫలాన్ని ... కోరదు....పద్మ....ప్రేమ దేవత .... మీ రిద్దరూ....సుఖంగా....(అంటూ పద్మా కుమారుల చేతులు కలిపి ప్రాణం విడుస్తుంది)

(మధు నెమ్మదిగా వెళ్లి శోభ త్రాగి మిగిల్చిన విషపూరితమైన పానీయాన్ని త్రాగి బాధపడుతూ వుంటాడు. కుమార్, పద్మల ముఖాల్లో విచారం తాండవిస్తుంది. నారాయణరావు ప్రవేశించి అక్కడి దృశ్యాన్ని చూసి కర్తవ్య శూన్యుడై, కళ్ళవెంట నీరు కారుస్తూ శిలా విగ్రహంలాగ నిల్చుండిపోతాడు.)

కుమా:- (నారాయణరావుని చూసి పెద్దగా) నాన్నా! (కాళ్ళమీద పడతాడు.)

నారా:- (లేవదీస్తూ) నాయనా! విచారించకు. మీ రిద్దరూ శోభ ఆత్మశాంతికోసం ఆదర్శ దంపతులుగా మీ జీవితాలు సుఖవంతంగా గడుపుకోండి. మీది ప్రేమకులం....అంతే కాని నా బ్రాహ్మణీకం భ్రష్టత్వం కాలేదు. నా యజ్ఞోప వీతం నన్ను విడిచి పోదు. నేను సద్బ్రాహ్మణ్ణే. నా వంశం పవిత్రమైనదే. సంఘ ధర్మసూత్రాల ప్రకారం నీకు బ్రాహ్మణ ఖర్మకు అర్హత లేదు. మీ రిద్దరూ సుఖం గా వుండండి. నేను యే ఆశ్రమంలోనో నా జీవితం గడుపు కుంటాను.....యివిగో తాళంచెవులు. (అందిస్తాడు.)

కుమా:- వద్దు నాన్నా! అంతా యిక్కడే వుండిపోదాం.

నారా:- వీలుపడదురా! సంఘం సమ్మతించదు. నన్ను నిర్బంధించకండి. మీరు సుఖంగా వుండండి; నా కదే సంతోషం.

(కుమార్, పద్మలు నారాయణరావుకి నమస్కరిస్తారు. నారాయణరావు ఆశీర్వదించి నెమ్మదిగా నిష్క్రమిస్తాడు. ఆ దారినే స్వామినాధన్ ఏడుస్తూవున్న పిల్లాణ్ని తీసుకొస్తాడు. పద్మ అందుకొంటుంది. మధు ఆయాసపడుతూ వుంటాడు. ఆ చప్పుడు కుమార్ విని మధుని సమీపిస్తాడు.)

మధు:- (పెద్దగా ఏడుస్తూ) కుమార్: యిక నాకు శెలవు. నేను చేసిన అన్యాయం నన్ను అధపతనానికి ప్రోక్కేస్తోంది. తీసుకో.... నా ప్రాణుల్ని మీ ప్రేమకు కానుకగా యిస్తున్నాను. (దేకుతూ పద్మని సమీపించి నమస్కరించి) తల్లే, పద్మా! నేను చేయదల్చుకున్న మోసానికి నన్ను నీవు క్షమించు తల్లీ! కుమార్! క్షమించవూ?....

కుమార్:- (ఆత్రంగా) మధూ!

మధు:- అవును. అర్థంకాని స్వార్థం నాలో ప్రబలమై నన్నీకాడికి తెచ్చింది. అందుకే నిన్ను క్షమించమని కోరుకుంటున్నాను. యిదే నా అంతిమ కోరిక. నీవు క్షమించానంటే నాకు అదే చాలు. కొంతవరకన్నా నాకు శాంతి కల్గుతుంది.... అను, క్షమించానని.... అ .... న .... వూ .... కుమార్....

(ప్రాణం విడుస్తాడు)

(వాయిద్యాలవారు విషాదగీతికను వాయిస్తూ వుంటారు. కుమార్, పద్మలు కళ్లవెంట నీరు కారుస్తూవుంటారు. తెర నెమ్మదిగా జారుతుంది.)

సమాప్తి.






